గీ. అవశుఁడై పడియుండియు నాద్విజుండు
శిష్యతతిచేత భక్తిఁ బూజింపఁ జేసె
భిక్షుగాని శంకరుండుఁ దృప్తిని దనర్చి
స్వకృతి మగు బ్రహ్మసూత్రభాష్యంబు చూపె. 86.

క. అది యట్టిద సుజనదయా
స్పద మయిననె నిఖిల మగునిబంధనము యశః
పద మొందుఁ; గానియెడ నం
దదుకుబ్రిదుకు గాంచవచ్చు నణఁగఁగ వచ్చున్. 87.

వ. అంత భట్టపాదుం డాగ్రంథమును గన్నులఁ గాంచి యుప్పొంగి
వగచి యిట్లను. 88.

గీ. ఇట్టి దీక్షను నేను గ్రహింపనేని
భాష్యములకు రచింపనే వార్తికములఁ
గనఁగఁ దత్ప్రథమాధ్యాయమున కెనిమిది
వేలవార్తికముల యవలీలఁ గావొ. 89.

ఉ. పారవిహారసంసరణసాగరమగ్నులకున్ భవాదృశో
దారచరిత్రులైనమహాత్ములసంగతి యొక్కటే సుమీ
పారము సేరఁగాఁ దగునుపాయము గా కితరంబు లేతదు
త్తారణశక్తి నుత్తవె కదా వగ ద్వా నలువన్ జగద్గురూ! 90.

క. చిరముగ భగవంతుని నిను
వరయుం గోరెదను నేఁటి కది తీఱెను సం
వరణాధ్వగు లగు నరులకుఁ
గర మభిమతసిద్ధి యిష్టగతిఁ గలుగునొకో. 91.

గీ. కాల మిష్టులతో నొకవేళఁ గలుపుఁ
గలుపు నొకపు డరిష్టు లౌఖులులతోడ
నటుల కలిపియు నెడఁబాపు నంతలోన
కష్టసుఖములు కాలంబుకైవసములు. 92.

వ. అనవుడు యతిపుంగవుఁడు 'విబుధేంద్రా! భవదీయచరితం బంత యు వింటి. భావత్కం బగుతంత్రవార్తికం బధ్యయనించితి. నీవు మహీతలంబునం దవతరింపవేని జైమినిప్రయాసంబు వ్యర్థంబు గాదె. హవ్యంబుల దేవతలను గవ్యంబులఁ బితరులను దనియించితి. వైదికమతకంటకు లగుజైనాదిపాషండజనంబుల నుచ్చాటనం బొన ర్చి జన్మం బర్థవంతము గావించికొంటి వైన నేమి నేఁ 'డాజైనగురు ద్రోహము నీశ్వరనిరాస మనునిజదోషద్వయపరిహారకంబుగఁ దు షాగ్నిఁ జొచ్చి' తని కింవదంతి యీక్షేత్రంబునందు యాలించితి. తుషాగ్నిప్రవేశ హేతు వదియ యగునే వినవలతు ననుటయుఁ గుమారిలుఁ డిట్లనె. 93.

సీ. చదివినాఁడను వేదశాస్త్రమ్ము లామూల
మాచూడముగ బాల్యమందె శ్రద్ధ
విరచించినాఁడ నిర్భరదీక్షఁ దంత్రవా
ర్తికముఖ్యకృతులు సుశ్రీప్రియముగ
గెలిచినాఁడ సభాస్థలుల వితండావాదు
లగుజైనకోటిఁ బెంపడఁగ గడంకఁ
బొందినాఁడ ననర్ఘములు భోగములు యాగ
ముల దైవతర్పణంబు దొలఁచికొంటి

గీ. వేదమార్గరిరక్షమై వెదకి వెదకి
నాస్తికులఁ బలుమారు వేటాడినాఁడ

వార్ధకమునఁ బ్రయాగకు వచ్చినాఁడ
వ్రతి నాచుఁ గాల మిటఁ బుచ్చినైచినాఁడ. 94.

సీ. అక్షర మ్మొక్కటి యైనఁ జెప్పినవాఁడు
గురుఁ డనుమాట నే నెఱుఁగనొక్కొ
స్వమతాభిమానవిజ్ఞానంబుల గురుఁడు
తనుఁ దా నశింప నాతప్పు దెట్లు
గురుఁడు సౌధమునుండి కూలఁద్రోయింప జీ
వించియు నింత నిందించితినొకొ
నృపతి యారీతివన్నిదము వెట్టెను గదా
నేన యోడినఁ జాక నిలుతునొక్కొ
గీ. కుమతవిధ్వంసనము సేయుకొఱకుఁ గెలుతుఁ
గాని గురుఁ జంప నూహించి కాదుగద! యు
జాకృపాణీయముగ నది సంఘటిల్లెఁ
జేసికొంటి దానికిని బాచితము దేవ! 9 .

శా. నామూలంబున దేశికుండు బలవంతం బైనచాఁ వొందినాఁ
డేమో యంచు ననేకనిష్కృతులు మున్నే చేసికొన్నాఁడఁ జు
మ్మా మీమాంసకుఁ డౌట; "శత్రుజయమం దేదోషముఁ లేదటం
చామోదించిరి ధర్మవేత్తలలనాఁ డాసేతుశీతాద్రిలోన్. 96.

మ. భృగుపాతంబా తుషాగ్నిలోఁ బడుటా వారిం జొచ్చుటో నల్పఁగా
నగుఁ గాయం బసమర్థ మానెడలఁ గర్మాసక్తుఁ డౌ వేత్త' పు
ణ్యాగతుల్ హ స్తగతంబు లాత్రవతి' కటం చామ్నాయముల్ దెల్పవో
పగవా రట్టుల కింవదంతులను నాపై మోపినా రేమొకో 97.

క. వాని నటుపెట్టు పాండవు
లాన్నాఁడు తనూనిరీహు లగుచు మహాప్రి

స్థానమ్ము నలువరే యటు
లేనుఁ జొచ్చితిఁ దుషాగ్ని నిది వ్రతము సుమీ 98.

చ. శ్రుతియ స్వతఃప్రమాణ మనుచుం బ్రకటింపఁగఁ బూని వేనినం
గతి యెడఁబాయ నించుకసుఖంబును గూడఁ బ్రపంచ మీయన
ర్థ్యాతఁ గనఁ జాలదో- యొకపు డైనను నాశ్రుతిలోకసిద్ధు నం
చితపరమార్థు నీశు నిరసించితిఁ గాని యెనర్ప నిష్ఫలతన్. 99.

గీ. నీవు భాష్యమ్ము సేత వింటిని ముదంబు
గంటి వర్ధానికిని వార్తికంబు గూర్చి
యశము గనువాఁడ వనుకుతూహలము గంచు
నేమి లాభ మామాట నే నిపుడు నుడువ 100.

ఉ. ఆతతసారతత్త్వమున నార్యజనంబులఁ బ్రోవఁగావ న
ద్వైతము, భూమిఁ బుట్టుభగవంతుఁడ వంచు నెఱుంగుదుం యతి
వ్రాతలలామ! మున్న కనుపట్టి ననుం జరితార్థుఁ జేయుచో
నీతతి నిట్టిదీక్ష వహియింప నిఁ కేమన లాభ మే మగున్. 101.

గీ. అకట దీక్ష వహించి తుషాగ్నిఁ బడితిఁ
గాన శాబరభాష్యమ్ము కరణి నీదు
భాష్యమునకును వార్తికపాఠమును ర
చించి యశ మొందుభాగ్యము చెందనైతి. 102.

క అన నీషద్వికసితముఖ
వనరుహుఁ డయి గురుఁడు పలుకు వైదికధర్మా
యనకంటకు లగుజైనులఁ
దునుమఁగఁ బొడమినయుమాసుతుఁడవు గావే. 103,

గీ. ఆజనుఃశపావనుఁడవు నీకఘము గలదె
యేటి కీదుష్కరవ్రతం బిదె కమండ
లూదికము చల్లి బ్రతికింతు నొసర భావ్య
వార్తికమ్ము రచింపు ధీవర్య లేచి. 104.

ఆ. అనెకుబుధవతంసు నాత్మవిద్వర్యుని
శమధనైకధుర్యు శంకరార్యుఁ
బ్రశ్రియంబు దోఁచఁ బలికె విద్యాధనుం
డైనభట్టపాదుఁ డనువుమీఱ 105.

సీ. నీపల్కు లెన్న గానీ, శుద్ధమైనను
లోకవిరుద్ధముల్ సోఁకఁజాల
నాజానకుటిలులంటైన వింటనుబోలె
గుణమె మహాత్ములు గూర్చుచుందు
చిరమృతునేని సంజీవింపఁజేయుదు
పటుదయోర్మిళి దృష్టిపాతమునన
వ్రత మాగమోక్త మారభించి త్యజియించి
బుధజనాదర మెట్లు పొందువాఁడఁ
గీ. దెలియనె భవన్మహత్త్వ? ప్రాణులను ద్రుంచి
మరల సృజియించునీకు నమ్మనువు కొంత
యైన విడఁజాల నీపూనినట్టివతముఁ
దారకబ్రహ్మ మెఱిగించి ధన్యుఁ జేయు. 106.

గీ. జగతి నద్వైతపథము విస్తరిలఁజేయఁ
దలఁచితేని జయింపు విద్వత్పరార్ధ్యు
మండలనాఖ్యు దిగంతసంభ్రాంతయశుని;
నతఁడు జితుఁడైన జగమెల్ల హస్తగతము. 170.

ఉ. ఆతఁడు కర్మయోగమును వ్యాప్త మొనర్చుచు విశ్వరూపవి
ఖ్యాతిని మించె ధాత్రిని; మహాగ్రహియై శ్రుతికర్మనష్టుఁడై
ప్రీతిఁ బ్రవృత్తిశాస్త్రపదవిన్ బడి, రోయు నివృత్తిశాస్త్ర మ
న్నా! తగుయుక్తి వశ్యుని నొనర్చుకొనన్ గడముట్టుఁ గోరుకుల్. 108.

వ. "ఉంబేకుం" డనుపేర లోకంబునం బరఁగు నవ్విశ్వరూపుఁడు నాశిష్యుఁడై సకలవిద్యామండనుండు కావుటంజేసి మండనుం డనుబిరుదనామంబున వ్యవహృతుం డగుచు నుండు, నుభయభారతి యను పేర నొప్పునయ్యాయజూకశిరోమణిజాయ "యుంబ" యనునామంబున బంధుజనులచేఁ బిలువంబడుచుండు. నాయమ దుర్వాసోముని శాపంబున మానవియై జనించినభారతియ యని ప్రసిద్ధిగల దది యట్లుండనిమ్ము. 109.

క. ఆవిబుధుఁ డఖిలశాస్త్రక
లాన్వలి నను మించు శిష్యులందుఁ బ్రియతముం
డీ వతనిసతిని సాక్ష్యవి
ధావర్తినిఁ జేసి గెలు మతని వాదమునన్. 110.

గీ. ఇతనిచేఁ దావకీనభాష్యమున వార్తి
కముల గ్రథియింపఁజేయుమీ యమలచరిత!
సమయమునకు విశేషచందమున వత్తు
తారకముఁ దెల్పి నను ధన్యతముని సల్పు. 111.

మ. నిలు నిర్వ్యాజకృపా! ముహూర్త మిచటన్, నీరూపు యోగీంద్రహృ
న్నలినాంభోరుహభాగ్యమున్ గనుచుఁ బ్రాణంబుల్ విడంజాతునం
చలఘుజ్ఞాని యనం డనన్ గురుఁడు శుద్ధాద్వైత మంత్రప్రహి
ర్గళితాజ్ఞానము బ్రహ్మమున్ దెలిపె నిష్ఖండామలజ్ఞానమున్. 112.

క. శంకరుఁ డిటు సకలజగ
చ్ఛంకరుఁ డుపదేశమిచ్చి శౌరాపథని
శ్శంకగతి మండనాఖ్యుని
భంకరభవనమున కేఁగ వాఛించుటయున్. 113.

ఉ. మాటలు మాని శాంతిధనమాన్యుఁడు భట్టపదుండు హృత్తమః
పాటన మాయమత్వవినివారక మద్వయతత్త్వ మూని జం
జాటము లెల్ల నూడిచి ప్రసన్నము వైష్ణవధామ మొందె న
ప్పాటన శంకరార్యునికృపారస మందుటఁ జూచుచుండఁగన్. 114

—:శంకరుఁడు మండను దర్శింప నరుగుట:—

గీ. అపుడు భగవంతుఁ డగుశంకరార్యుఁడు సహ
శిష్యుఁడై యోగశక్తిఁ జెచ్చెర నభోయ
నమునఁ జని చేరుకొనియె మండనబుధేంద్రు
కాఁపురం బైనమాహిష్మతీపురంబు. 115.

గీ. రత్నకిమ్మీరవరణ మబ్రమ్ము గూర్చ
నరసి మాహిష్మతిపురాభ్యర్ణవనిని
నంబరవతీర్ణుఁడయ్యె నారాయణావ
తారుఁ డగుభార్గవుని శేవ దండియతఁడు. 116.

చ. వికసితవారిజాతవనవీథుల నాటల నాడు, చూర్మిక్షో
దకకణశీకరంబులను దానములాడుచుఁ, దీరసాలమా
లిక లెగఁబ్రోఁకి యింత గదలించుచు నయ్యెడ నర్మదానిలా
ర్భకములు భాష్యకారుశ్రమభార మడంచి భజించెఁ జల్లఁగన్. 117.

ఉ. ఆహరితాపలోపనమునందుఁ గృతాహ్నికుఁ డౌచు స్వస్తికా
రోహణశాలియై ఖరకరుండు వెలుంగ గురుండు శిష్యసం

దోహము గొల్పి రా బుధవిధుం డగుమండనుఁ గాంచువేడ్కఁ ద
ద్గేహము సేరుచుండ గనెఁ దదీయభుజిష్యలఁ దోవ నొక్కెడన్.

గీ. నీరు దే నేఁగునప్పరిచారికలను
మండనసుధీంద్రుగృహ మెట నుండు ననుచు
నడుగ నద్భుతశంకరు నతనిఁ గాంచి
ముదితలై యిట్లు పల్కి రమ్ముదిత లాఁగి. 119.

సీ. మహి వేదము స్వతఃప్రమాణమా పరతఃప్ర
మాణమా యనెడుసంభావణముల
ఫలము నిచ్చునది నిచ్చలు కర్మమా పర
మాత్మమా యనెడు వ్యాహారములను
జగము శాశ్వతమా యశాశ్వతమా యన్చు
గెరలి వాదించెడుగీఃఫణితులఁ
యత్యాశ్రమంబా గృహస్థాశ్రమంబా మో
క్షోధాయకం బగు ననెడునుడులఁ
గీ. గీరభామిను లేగృహద్వారబద్ధ
పంజరస్థమ్ములై శాస్త్రపటలి ఋత్రితులఁ
జదివి వాదించుకొనుచుండు నదియ మాప్ర
భుండు మండనపండితుం డుండుగృహము. 120.

సీ. ప్రాకారతోరణవ్యాకీర్ణ మయి శిలా
స్తంభశతభ్రాజితంబు నగుచు
గర్భగృహేశ్వరాగారశయ్యాగార
శిల్పనైపుణ్యప్రసిద్ధ మగుచు
సర్వవిద్యాపాఠశాలాప్రపంచసం
భావితతత్పరోభాగ మగుచు

నఖిలర్తు ఫల లతాంతాంచిత తరులతా
భ్యర్హితప్రమదావనాఢ్య మగుచు
గీ. విబుధమండనమిశ్రు నివేశ మదిగొ
తాళభూజోచ్ఛ్రితంబు విద్యాలయాంక
విలసితంబయి రెండువీథులకు నడుమ
వైజయంతంబు తలఁదన్ని తేజరిల్లు. 121.

క. అందాక పెద్దవితర్దిక
యందున్ గద్దియ వసించి యావిబుధుఁడు రా
త్రిందివము శిష్యబృందము
లం దనువు శ్రుతిస్మృతమ్ములను నేర్పుచున్. 122.

గీ. గృహమునందె యుండె నేఁడు పైతృకము నెఱపు
చున్నవాఁ డన్యులను జూడ నొల్లఁ డితరు
లింటఁ గాలిడకుండ బహిష్కవాట
బంధన మొనర్చె నెటు లేఁగువాఁడ వనుచు. 123.

మ. పటువాగ్వైఖరి నిట్లు వా రనఁ బరివ్రాణ్మౌళి తాఁ బాదుకా
ఘుటికాసిద్ధు లెఱుంగుటన్ దివిఁ జనన్ గోర్కెన్ మదిన్, గాని యం
తటిలో నెంచెఁ నతండు ధిక్కరణమున్ గావించు నేమో విశం
కటదీక్షన్ పితృకార్యమున్ నెఱప విఘ్నం బొందు నస్థితిచే. 124.

క. కావున ముందుగ నీయం
తేవాసుల నంపి వార్త తెలిపినచో న
న్నావిప్రుం డతిథిగఁ గొని
పోవును దనయింటి కనుచు బుద్ధిఁ దలఁచుచున్. 125.

**శంకరశిష్యులకును మండనశిష్యులకును వాక్కలహము:**

ఉ. అచ్చట నొక్కెడన్ నిలిచి యారసి శిష్యుల 'మీర లేఁగి మే
మిచ్చట నున్నవార్త వచియించి బుధేంద్రుఁడు సమ్మతించెనే
నిచ్చటి కేఁగుదెం, డవుల నేఁగుద మప్పుడ' యంచుఁ బంపఁగన్
జెచ్చెర వారు మండనమనీషి గృహావరణంబు సేరుచున్. 126.

ఉ. కాంచ బహిష్కవాట మతిగాఢపినద్ధమహార్గళంబు గా
వించుట గోచరించుటయుఁ బెద్దయెలుంగునఁ బిల్చి పిల్చి 'యో'
యం చొకమాట పల్కినటు లైన నొకింత దిటంబునన్ బ్రతీ
క్షించుచు నుండ మండనుభుజిష్యులు తీసిరి తత్కవాటమున్. 127.

ఆ. తీయునంత లోని కాయతుల్ బిఱబిఱఁ
జొచ్చి వచ్చుచుండఁ జూచి మీర
లెవ్వ రేమిపనికి నేఁతెంతు రివ్వేళ
ననఁగ వారు మండనార్థ మనుచు. 128.

చ. మొదలిటికత్త్యె దాఁటి చనఁ బో నట మండనుశిష్యు లొక్కమై
యెదురుగ నేఁగుదెంచి జనియించెడికోపము డిగ్గఁద్రావునె
మ్మదులఁ జలాచలావయవమండలిఁ గోకనదోపమాక్షులన్
మదము బయల్పడన్ దదయనం బరికట్టిరి క్రోఁతిమూఁక నాన్. 129

క. ముండితశిరములు కావులు
దండములు కమండలువులు దాల్చుపరివ్రా
ణ్మండలము గువ్వకరిగొని
దుండగమునఁ బెలుచ నవ్వఁదొడఁగిరి వారల్. 130.

ఆ. నవ్వి పువ్వఁదిట్టి చివ్వకుఁ జేసాచు
మండనాంతవాసిమండలికిని

శంకరార్యశిష్యనమితికిఁ గొండొక
నడచెఁ దీవ్రజల్పనములవాదు. 131.

వ. అట్లు పెద్దరొదగాఁ గొంతతడవు వాదు నడచినపిదప నద్దుమాన్చి మండనశిష్యుం డొకండును శంకరశిష్యుఁ డొకండును నిట్లు వివదింపఁజొచ్చిరి. 132.

సీ. ఎటనుండిరా ముండ యిహిహీ యనుచుఁ బల్కె,
నాగళం బే ముండ ననుచుఁ బల్కె
నది కాదు నీతోవ నడిగితి నాఁగ, నా
తెరువు నీతో నేమి తెల్పె ననియె
నీయంబ ముండ పోరా యన్నది యనంగ,
నడుగు ని న్నట్లంట న్యాయ్య మనియె
బీతమా సుర యిట్లు పేలుచుంటివి నాఁగఁ,
బీత మె ట్లగు సుర శ్వేత మనియె

గీ. నెఱుఁగుదువె దాని రంగు నా, నేను రంగు
నీవు తద్రిచి నెఱుఁగుదు మింత నిజము
టంచు వక్రోక్తులను నిరసించుకొనుచుఁ
గినుక వెలిఁబుచ్చుకొనిరి ప్రాకృతులపగిది. 133.

గీ. అలకళంజభక్షణమదాత్మజాత
దుష్ప్రలాపంబు లిట్టులే తోఁచు ననఁగ
సత్య మాడితివి త్వదాత్మజాతుఁడు పిత
వలెఁ గళంజాశియై పేలువాఁడ యనియె. 134.

గీ. ఖరము మోయుంగఁ జాలనికంథ నకట
మోయఁగలనీకు దుర్గ్రహమ్ములుగ దోఁచె

నా శిఖాయజ్ఞసూత్రంబు లధమచరిత
బ్రహ్మబాధుఁడ నినుఁగన్నఁ బాతకముర. 135.

క. నీజనకుఁ డేని మోహం
గాఁజాలనిభ్రాంత మోవఁగలిగితిఁ గానీ
యోజాల్మ! సిగయు జన్నిద
మోజన్ శ్రీశిఖార మగుట నుత్సర్జింతున్. 136.

క. ఆలికి నన్నము పెట్టం
గా లావఱి శిష్యపుస్తకభరము మోవం
జాలినబ్రహ్మవినిర్మతఁ
దాలుచునీగుట్టు ప్రకటితం బయ్యెఁగదే. 137.

క. గురుజనశుశ్రూషఁ దొఱఁగి
తరుణీశుశ్రూషయందుఁ దర్పరమతివై
వరలెడుకర్మవినిర్మతఁ
దరలెడునీనడత ప్రకటితం బయ్యెఁ బలే. 138.

క. భామలకడుపునఁ బుట్టియు
భామలు పెంపంగఁ బెరిఁగి బాలిశ నేఁ డా
భామల దూఱుచు నుంటి వి
దేమి కృతఘ్నత్వ మూని యేలా బ్రదుకన్. 139.

క. ఎవ్వరినుండి జనించితొ
యెవ్వరిచనుఁబాలఁ గ్రోలి యిటు పెరిఁగితివో
యవ్వెలఁదుల నెఱు గవయుదు
పువ్విలుతుసకేళిఁ బశువుపోలిక మూఢా. 140.

గీ. యత్నపూర్వ మగ్ను లకట! యుద్వాసించి
వీరహత్యఁ గొంది తౌర జడుఁడ!
పరమపదము బ్రహ్మ మెఱుఁగఁగాఁ జాలక
యాత్మహత్యఁ గంటి వౌర ఖలుఁడ! 141.

క. చోరునివలె దౌవారిక
వారము వంచన మొనర్చి వచ్చెద విస్సీ
పారాశర్యునకుఁ గూడ
కౌరా యెటు కుమతుఁ డేగఁ జుట్టుల ఛీఛీ 142.

గీ. కర్మకాలమునందు మూర్ఖాళితోడ
మాదృశులకు వాకొంట ధర్మమ్ము గాదు
తెలివి యతిభంగముగఁ బల్కఁ దెలిసె నౌర
యతికి భంగ మొనర్చు నా కగునె దోసఁగు 143.

క. "యతివలన భంగ" మని స
మ్మతిఁ బంచమ్యంతమున సమాస మ్మౌదు
ర్మతి! చెప్పకొనుము కా కటు
యతి భంగింపంగ నీకు నానియె యెప్పుడున్. 144.

ఆ. బ్రహ్మ మేడ? నిద్దురాచారరతు లేడ?
నెచటిసన్న్యసనము లిట్టికలిని
మృష్టభోజనార్థ మిట్టుల యతివేష
ధారి వైతి వంచుఁ దలఁపవచ్చు. 145.

ఆ. నాక మేడ? నిద్దురాచారరతు లేడ?
నగ్నిహోత్ర మేడ? నకట కలిని
గార్హ్యధర్మతత్పరత నె కర్మఠరూప
ధారి వైతి వంచుఁ దలఁపవచ్చు. 146.

క. అని గృహి, యతి, శిష్యద్వయ
మనయము కినుపొంది తీవ్ర మగువాకమునన్
తనతనమర్యాదోల్లం
ఘనమున కై రాత్మకర్తృకతఁ గన కుంటన్. 147.

ఉ. కొండలు లోని కేఁగి తనుకున్ యతిరాజికి నైనవాడప్పుం
దండడిఁ దెల్పఁ గొండొక విశాఖము నుండనుఁ డాత్మ నెంచెఁ "గ
ర్మందిని జూడ" నన్ననియమంబున నుండఁగ నాగురుండె తా
నందెనటే తురీయ మగునాశ్రమ మే మొనరింతు నిమ్యోడన్. 148.

క. గురుఁడు గురుపరుఁగ శంకరు
వరియించి తరించె నంచు వార్త వినియు నుం
దిరమం దమగిడువారా
శరుల నరయ కుంట శిష్టసమ్మత మగునే?. 149.

సీ. ప్రబలసిద్ధాంతనిబద్ధ పూర్వమీ
మాంసాగమ ప్రమాణ మెట్లు
లెందుఁ బ్రాయశ్చిత్తమే నెఱుంగక సల్ప
కర్మకాండము మానఁగల్గు టెట్లు
సర్వజ్ఞుఁ డస్మదాచార్యుఁడే మారసి
సన్యసించెనొ యెంచఁజాలు టెట్లు
శ్రాద్ధకాలమునఁ బారాశరిభిక్షాప్ర
దాననిషేధవిధాన మెట్లు
గీ. పాయు టెట్టుల గురుసంప్రదాయసరణి
నిష్టమేని యనిష్టమే నేకమతిని
శిష్యుఁ డాచార్యుమతమునే స్వీకరింపఁ
దగు నటం చప్రసూచించెటు తెలుసు టెట్లు. 150.

వ. అని తనమనంబునఁ గొంతసేపు మథనము గావించి భట్టపాదులపా
దముల నమ్మినవాఁడగుటం జేసి యాసుధీసింహుఁడు యతివదనవిలో
కననిరాకరణవ్రతంబు తత్క్షణంబ యుత్సర్జించుకొని. 151.

—: మండనుఁడు శంకరునకు భిక్షువందన మొనర్చుట :—

శా. సందేహమ్ములు వాయఁదట్టి నిజశిష్యశ్రేణి నీక్షించి 'క
ర్మందుల్ పూజ్యులు శ్రాద్ధవేళ గృహిధర్మం బీఁగ న్యాయంబె? వా
రిందుల్ రాఁ గని మీరు దూఱఁ దగునే యెచ్చోట నున్నా' రటం
చుం దోడ్తోడన మండనుండు సహశిష్యుండై యెదుర్వచ్చి తాన్.

గీ. అర్ఘ్యపాద్యాదికంబుల నర్పి లిచ్చి
తనవినేయులయవినయమును క్షమింప
వేఁడుకొని శంకరార్యుఁ డవ్వేళ నుండె
ననుపలుకు వినుచు హర్షించి యంగవించి. 1 3.

శా. పౌరుల్ పిన్నలుఁ బెద్దలున్ హితులు సంబంధుల్ నిజాంతేవస
ద్వారంబున్ దను నంటి రాఁ జని పురాంతర్వర్తిదేవాలయ
ద్వారోపాంతవితర్దికాసమతలాధ్యాసీను ధీశ్రీసమా
హారున్ శంకరుఁ జేరి తా సలిపె సాష్టాంగప్రణామంబులన్. 154.

క. ద్విజుఁ డట్టు 'నకర్మణా న
ప్రజయా' యను శ్రుతిఁ బఠించి వందన మిడఁగా
బుజగతి 'నారాయణ' యనుఁ
ద్విజగద్వంద్యుండు తద్యతిగ్రామణియున్. 155

ఉ. వందన మావిధిన్ సలిపి పాద్యము నర్ఘ్యము నిచ్చి భక్తి మా
మందిరమున్ దొరంగొనవలె మత్పితృదేవత లెల్ల నేఁటితో

సందెడు రూర్ధ్వలోకముల సంచును శాస్త్రము నేఁడ యంచుఁ గ
ర్మందిలలోను శంకరుని బ్రార్థనసేయు ననున్ స్మితాస్యుఁడై. 156.

ఆ. అన్నభిక్షఁ గోరి యడుగేర నోయన్న!
వాదభిక్ష మిడఁగ వలఁతి వేని
ఋణము నందువాఁడఁ; గాదందువా చెప్పు
వచ్చినట్టి త్రోవఁ బట్టి పోదు. 157.

క. ఓడనివానికి నోడిన
వాఁ డంతేవాసి యగుటె పన్నిదము సుమీ
నేఁడే వాదింతము తగు
ప్రోడల రావింపు ధర్మమూర్తుల సభకున్. 158.

క. యత్యాశ్రమి వయ్యు విశా
దాత్యాసక్తుండ వగుట యర్హమె యంతే
శ్రుత్యంతపథావనకై
యత్యమె హేతువుగఁ దెలియుమా బుధవర్యా! 159.

చ. జగతిఁ ద్రయీశిరఃపథము జాగృతి నొంది ప్రచారమందు నుం
డఁ గనుట దక్క వాంఛితము నా కెదియుం గనరాద, నీవు రే
వగలు తదేకదృష్టిని సవంబుల మున్గి భవాగ్నితాప మా
ర్పఁగఁ దగు మన్మతంబును దిరస్కృతి సేయుదు వట్టి దిట్టవై. 160.

ఆ. అభిభవించి నిన్ను నఖిలవివాదిని
జగతిఁ దన్మతమ్ము చాటువాఁడఁ
గొనుము నామతమ్ము గొనకున్న వివదింతు
వో జితోఽస్మి యందువో వచింపు. 161

గీ. అను యతీంద్రునియర్థయుక్తాభిభాష
ణముల కరుదంది కీర్తిసంతతుఁడు బుధుఁడు
నపహరిభావ మొనసియుఁ బ్రవచియింపఁ
బూని నిజగౌరవము మనంబునఁ దలంచి. 162.

గీ. అనునె వీఁడు 'జితోఽస్మి' యంచును సహాస్య
వదనములవాఁడె వాదింప వచ్చుఁగాక
వేదసమ్మతమతమును వీడి యెప్పుడు
మానిపరికల్పితమతంబుఁ బూనఁబోఁడు 163.

ఉ. 'వచ్చునె యెన్నఁడే నొకవిపశ్చిదపశ్చిముఁ, డౌనె వానితో
వచ్చుగ నాకు వాదకథ' యంచుఁ గుతూహల మొందునా కదే
వచ్చె జయోత్సవంబు, మనవాదకథన్ ఫలియించు విద్యలం
దొచ్చెము లేని నాశ్రమ; మహా! సుధ యబ్బె నెవండు గాదనున్.

సీ. శమియింపఁ జేయుదు యమమహాంతనేని స్వ
యమ్ముగా నామహిమ మ్మెఱుఁగవో
శానిమ్ము కలహమ్ము కలహాంససత్కలా
భరితయాష్మాకీనభాషణముల
వినవో దర్శనపాతజనిత మానాపోధి
వైరిగర్వవనీకుఠారధార
నాసించి తి ట్లేల యత్యల్పభిక్షమ్ము
వాదభిక్షమె యిచ్చువాఁడ నిచ్చ
గీ. వాద మన సిద్ధముగ నున్నవాఁడ జిరము
గా నభిలషింప వాద యొక్కరుఁడు. రాఁడ
యట్టిలోపంబు దీఱంగ నరుగుదెంతు
వింక సందేహమేల యతీంద్రచంద్ర. 165.

క. కాని యిటఁ బ్రొద్దివాకుని
గానన: గెలుపోటములు తగన్ దెలిపెదవి
జ్ఞాని లభింపనివాదున
మౌన కుభయకంఠశోషమాత్రము మిగులున్. 166

క. వాదముల వాదియును బ్రతి
వాదియుఁ గొందురు విపక్షపక్షము, గానన్
వాదించుమనకుఁ దెలుపుమి
యేది ప్రతిన? యేది ప్రమాణ? మెవ రధ్యక్షుల్? 167.

గీ. ఏను గృహమేధిముఖ్యుండ నీవు భిక్షు
కాధిపతి విందు మనవిజయాపజయము
లకును బణనిర్ణయము సేయు మకుటిలముగ
నవ్వుల వాదింతము జిగీష యచ్చుపడఁగ. 168.

క. ధన్యుఁడ నైతిని యతిమూ
ర్ధన్యుఁడు వివదింప నాకుఁ దారసిలుట, వా
గ్జన్యము రే వగు, నిప్పు డ
నన్యమతి నొనర్తు మధ్యాహ్నక్రియలన్, 169.

వ. అని యాబుధుండు కుతపకాలము సమీపించుటఁ దెలిసి పునః పున
రభివాదనపూర్వకంబుగాఁ దనగృహంబునకు విచ్చేయఁ బ్రార్థిం
చుటయు, దండకమండలుధారియై యిలాగతుం డగుసరోజహితుం
డుంబోలె స్వశరీరకాంతుల దశదిశలు వెలిగించుచుఁ బాదచారియై
సహశిష్యసంతతికంబుగ మౌనియై శంకరార్యుండు రాజవీథిం జని
చని యొక్కయెడఁ గక్ష్యాంతరమ్ములు గడచి మండనమందిరమ్ము
దరియం జొచ్చి యర్ఘ్యపాద్యాద్యుపచారంబులం బడసి నిమంత్రిత

బ్రాహ్మణద్వయం బెదురు వచ్చి వందనంబు లాచరింప ముదితుండై యుండ.

శంకరుఁ డుభయభారతిని దీర్పరిగ నిర్ణయించుట.

ఉ. ఆసరసీజసంభవకులాభరణంబులు జైమినీయులై
యాసకశాస్త్రపారగు లటంచును వారలలో నొకండు ధ
ర్మాసన మెక్కి వాదముజయాజయముల్ ప్రకటించు నంచు స
న్యాసివరేణ్యుతో విబుధనాథుఁడు దెల్పుచు నుండునత్తఱిన్. 171.

చ. కలువల నీనుసోగ తెలిగన్నులు వీనులకోన లానఁ జె
క్కులఁ జిఱునవ్వువెన్నెల లిగుర్పఁగఁ గొప్పవటూర్ణలిన్ విభా
సిలఁ దెలిపట్టుఁగంచెలయుఁ జీరయుఁ దాలిచి విశ్వరూపుకో
మలి యరుదెంచి యయ్యతికి మన్నన మిన్నగ మున్ను గానరాన్.

క. పూఁదీవ కమ్మ తెమ్మెర
చే దుసికిలునటుల వంగి, చేర్చి నొసంటన్
జేదోయి వందనం బిడెఁ
బైదలి తను వ్రీడ ప్రౌఢి భక్తియు వంపన్. 173.

ఉ. ఆయెడ భట్టపాదుఁ డవిసట్టినుతుల్ మది నెంచి శంకరుం
డాయతివర్ మహావిదుషి యంచుఁ దలంచి బుధేంద్రుఁ గాంచి 'యే
లా యొరు లీవివాదముజయాజయముల్ వివరింప? నీవె యే
న్యాయము దీర్చు దానిఁ దలయందు ధరింతుఁ ద్రిశుద్ధిఁ బల్కితిన్',

క. అనుటయు నందఱు నౌ నౌ
నని రమ్మండనుఁడు నాలు నంగీకృతిఁ దె
ల్పెను గర్మకాల మెఱిఁగి భ
వనాంతరాళమున కేఁగె బాడబ్యమ్మున్. 175.

ఉ. అందఱు లోని కేఁగి సరయుంబుగ స్నానము లాచరించి మా
ధ్యందినకృత్యముల్ నెఱపు నంతటఁ బైతృకకర్మదీక్ష ని
ష్పందతఁ దాల్చి మండనుఁడు భక్తిసయుక్తి సపర్యఁ దన్పెఁ గ
ర్మందిని వ్యాసజైమినులమాఱట యాక్షితిదేవయుగ్మమున్. 176.

గీ. మోదమున శంకరునకు హస్తోదకమ్ము
"నమృత మ"స్తని మండనుం డమర నొసఁగ
శాశ్వతబ్రహ్మలోకవాసమున కరిగి
రతనిపితరులు విశ్వేదేవతలు నపుడ. 177.

ఆ. భక్ష్యభోజ్య చోష్యపానీయలేహ్యాది
వివిధభోజనముల నవనిసురులు
ముగుర కిడిరి బ్రహ్మముగ సర్వమెంచుచుఁ
దృప్తి గదుర గృహియు గృహిణి శ్రద్ధ. 178.

క. 'తృప్తా స్స్మ' యనఁగ ముప్పుర
సప్తార్చిస్సముల నన్నజలదానములన్
దృప్తుల నొనర్చి యనిపి ని
జాప్తులతో నన్నశేష మతఁడు భుజించెన్. 179

గీ. చామర లిడంగ శిష్యు లిష్టప్రసంగ
ముల నొనర్చుచు వైదుష్యవిలసనముగ
భోజనాయాస మెడయ నమ్ముగురు కొంత
సేపు మొగసాలయందు నాసీను లైరి. 180.

క. ఆవిధి శ్రమ ముడిగి మహీ
దేవు లిరువు రరిగి రెవరి తెన్నున వారల్
రేవాతీరగతం బగు
దేవాలయమునకు నరిగె దేశికప్రభుఁడున్. 181.

చ. అరిగి కదంబసాలవివహాంచిత మానొకమండపంబునన్
స్థిరముగఁ గూర్చుచుండి నిజశిష్యులు కోరఁ గురుండు గేస్తుతో
జరిగిననాఁటివృత్తముఁ బ్రిసన్నవచస్సరణిన్ వచించుచున్
జరిపెను నాఁటిరే యమృతసన్నిభమై క్రిమియింపఁ జల్లగన్. 182.

శంకరమండనమిశ్రుల వాదసభ.

శా. ప్రాతశ్శోణసరోజబంధురుచి నభ్రిం బుల్లసిల్లన్ యతి
వ్రాతాధ్యక్షుఁడతండు కాల్యములు నిర్వర్తించి పచ్ఛాత్రుఁడై
పీతిన్ మండనపండితౌకమునకున్ విచ్చేసి చొచ్చెన్ సుధీ
వ్రాతాలంకృత మాసభాభవనమున్ వాదంబు గావింపఁగన్. 183.

చ. సకలకలావిశారదను శారద నాత్మసధర్మణిన్ సమా
ధికరహితన్ బ్రితీతపతిదేవత సాక్షిణిఁ జేసి వాదకౌ
తుకమున నుండె మండనుఁడు దొయ్యలియున్ బతియాజ్ఞఁ బాడ్వివా
కకృతికి మేకొనెన్ జనులు కన్నులపండువుగాఁ గనుంగొనన్. 184.

క. అధ్యాసించెను బరిష
న్మధ్యస్థితధర్మపీఠి మహిళామణి త
త్సధ్యభిరూపత్వవివే
కాధ్యాసను వచ్చుశారదాంబిక వోలెన్. 185.

గీ. మండనునివాదకుతుకసమ్మర్ధ మెఱిఁగి
యులరుచుఁ బరావరజ్ఞుఁ డౌయతి మహేశుఁ
డూనెను బరావరైక్య సంధాన పరము
గా స్వకీయప్రితిజ్ఞ నుత్కంఠ నిట్లు 186.

సీ. అనఘమై పరమార్థమై సచ్చిదమలమై
యద్వైతమై యొప్పునట్టిబ్రహ్మ
మనవధికాజ్ఞానమునఁ జిక్కి ముత్తెపుఁ
జిప్ప వెండిగను దోఁచిన తెఱఁగున
బూావజ్జగదూభ్రివమై వెలుంగును దత్ప

రావరైక్యజ్ఞాన మబ్బనేని
విశ్వప్రపంచంబు విలయంబునొందునం,
తన తెల్ల మగును స్వాత్మవ్యవస్థ
గీ. దాన నబ్బు నిర్వాణ ముత్తమము దానఁ
గలుగుఁ దప్పక జన్మమోక్షము ధ్రువముగ,
నిందులఁ బ్రమాణ మెయ్యది యందువేని
సకలనిగమాంతవాక్యప్రపంచంబు సువ్వె. 187.

చ. విజయముగొందు నిందు, నొకవేళఁ బరాజయమే ఘటిల్లుచో
నిజము వచింతు సన్న్యసననిష్ఠ సమస్తము వాసి, కావులన్
ద్విజవర! రోసి, తాల్చెదను దెల్పుల వాదమునందులన్ జయా
పజయఫలంబు లియ్యుభయభారతియే మన కేర్పఱించుతన్. 188.

క. అనుచును శంకరభిక్షుం
డనల్ప మగుస్వప్రతిజ్ఞ నటుపూనఁగ మం
డనుఁడు స్వమతప్రతిష్ఠా
పన మగుశపథమ్ము నెఱపె స్పష్టముగ నిటుల్. 189.

సీ. చిదూప్రవస్తువుఁ జెప్పఁ బూనఁగ శబ్ద
శక్తి కయోగంబు సంభవిలుట
నప్రమాణమ్ము వేదాంతమ్ము- లిఁకఁ బూర్వ
భాగమో యటుగాక, వాక్యగమిత
మైన యశేషకార్యంబుల పట్లను
దాఁ బ్రమాణం బయి తనరుచుండుఁ
గనఁ గ్రియామాత్రంబునను బ్రసిద్ధమ్ములౌ
శబ్దంబులకు శక్తి సంఘటిల్లు
గీ. నాయువు సమాప్త మగుదాఁకఁ బ్రాణికోట్లు

సలుపవలెఁ గర్మకాండ మాసక్తి మిగులఁ
గర్మ మటు శ్రద్ధఁ జేయఁగాఁ గలుగు ముక్తి
యంతియే కాని లభియింప దన్యయుక్తి. 190.

క. వాదున జయేతరం బా
పాదిల్లిన నీప్రతినకుఁ బరమ విరుద్ధం
బూఁదెద నీ వనినటు లీ
నాదయితయె సాక్ష్యపదమునన్ వర్తిలుతన్. 191.

వ. అని. 192.

క. యతియున్ గృహపతియుఁ బరా
జితుండు జేతా శ్రమంబు సేకొనునట్టుల్
ప్రతిన లిటు నెఱపి యాభా
రతి నిలిపిరి సాక్ష్యవిష్టరభాజితగాఁగన్. 193.

మ. పరమోత్కంఠ యతీంద్రుఁడున్ గృహియుసభ్యశ్రేణి కైమోడ్పుఁద
త్పరిమద్వేదిక నాభిముఖ్య మమరన్ దర్భాసనాసీను లా
తఱి వారిర్వురకంఠసీమ సుమనోదామంబులం బూన్చి యు
య్యరవిందాయతపత్రనేత్రి యని ట్లాలింప సామాజికుల్. 194

క. ఎవ్వరిగళమున విలసిలు
మవ్వపుఁబువుమాల తొలుత మ్లానంబగునో
యవ్వానిది యోటమి యగు
నెవ్వరు వచియింపఁదగ్గ దే మింక నిఁకన్. 195.

గీ. అంచు దివ్యప్రమాణ మయ్యతివ దెలిపి
యతియుఁ బతియు భుజింప భిక్షాశనముల
నాయితి మొనర్చ నంతర్గృహమ్ము సొచ్చి
నవ్వుల వాదింప వారలు దిప్పరుచుండ. 196.

—:శంకరశిష్యులకును మండనశిష్యులకును జరిగినవాదము:—

క. మీ రేల మేము చాలమె
యారయుచుండుం డటంచు నాబుధుశిష్యుల్
పారాశరివరు శిష్యులు
నారంభించిరి వివాద మందఱు వినఁగన్. 197.

వ. అందు మండనశిష్యుం డొక్కరుండు శంకరగురుచ్ఛాత్రు నొక్క-
నిఁ గాంచి. 198.

క. ఓయతిశేఖర! నీవు తు
రీయాశ్రమ మెట్లు గొంటి స్మృతులన్ శ్రుతులన్
వేయిగతుల సన్న్యాసం
బీయుగమునఁ ద్యాజ్య మనుట యెఱుఁగవె యకటా. 199.

గీ. మఱియు శ్రుతులును స్మృతులుఁ బ్రమాణములుగఁ
దెలియఁ బల్కెడ వినుమయ్య! కలినిషిద్ధ
ములు తురగమేధ గోమేధ పలలపైతృ
కాంతిమాశ్రమ దేవరన్యాయ విధులు. 200.

సీ. యజ్ఞాధ్యయనహీన మానాశ్రమచతుష్ట
యమ్ము బ్రాహ్మణ్య మెనుట్లవుపలుచు
'నహరహ స్సంధ్యా ముపాసీత' యనువిధి
దూరుఁడై యగునె శుద్ధుఁడు ద్విజుండు
యజ్ఞోపవీతచూడాపవర్జనమున
నిరయమ్ము ద్విజుఁ డెట్లు నిస్తరించు
సత్కళత్రమునందు సంతతిఁ గనక వి
ప్రుం డెట్టుల పితౄణమును దొలంగుఁ

గీ. గాన వేదోక్తకర్మసంధానపరత
నంది యక్షయపుణ్యలోకాప్తిఁ గోర
వలయునే కాని యతి యీట కలియుగమునఁ
దలఁపరాని దటంచు విద్వాంసు లనరె. 201.

చ. యతివర! స్వర్గరాజ్యతనయాదికముల్ లభియించుఁ గర్మప
ద్ధతిఁ జరియింప నంచు శ్రుతితత్త్వవిదుల్ ద్విజు లెల్లఁ గర్మముల్
మతి నొనరింత్రు; కర్మ మణుమాత్రము వాయఁగరాని దంచు న
చ్యుతుఁడు కిరీటికిన్ దెలుపుసూక్తి నెఱింగియు భ్రష్టు లైతిరే 202.

గీ. కర్మమును గాల మెఱిఁగి తత్కర్మ మర్హ
కాలమున సల్పువానినే జ్ఞాని యండ్రు
విహితకర్మాచరణనిష్ఠ వెలయువాఁడె
భక్తిమంతుండు మఱి జ్ఞానవంతుఁ డనఘ. 203.

ఆ. కలినిషిద్ధ మనుట తెలిసియు సన్న్యాస
మెట్లు మీగురుఁడు గ్రహింపఁ దెగియె
నందు బ్రహ్మచారి యయి సన్న్యసించెనే
ప్రక్రమంబు విడిచి వక్రబుద్ధి 204.

క. అన శంకరశిష్యుం డనె
మనీషివర! యింత చదివి మందప్రజ్ఞ
జనుక్రియం బగుజ్ఞానం
బు నెఱుంగక యుంట యబ్రముగఁ గన్పట్టున్. 205.

క. ఎందాఁక వర్ణభేదం
బెందాఁక శ్రుతిప్రచార మెసఁగుఁ గలియుగం
బం దంతదాఁక నిలుకడ
నొందును సన్న్యాస మగ్నిహోత్రము లుర్విన్. 206.

వ. మఱి సంతానజదోషసంహతులఁ గర్మప్రోక్తదోషంబులన్
దరికొల్పఁగా దుష్కవహ్ని స్వర్ణమటు సన్న్యాసంబు; సంసారమం
దరయఁగా రాగవిదూరుఁ డౌతఁడియు సన్న్యాసాప్తికిఁ గాల మం
దురు శాస్త్రజ్ఞులు, బ్రహ్మచారియు విరక్తుం డైన నర్హుం డగుఁగా.

సీ. సకలచరాచరస్థానమై వెలుఁగొందు
బ్రహ్మంబె యజ్ఞసూత్రంబు గాఁగ
బరమవిజ్ఞానభాస్వద్దీపకళికయే
జ్ఞానైన కేశపాశంబు గాఁగ
జన్మమృత్యుభయార్తి సమయించు ముక్తియ
యమృతోక్షేమానన యర్థాంగి గాఁగ
నాత్మైక్యజాత మహానంద ముద్రానుఁ
భవ మాత్మజాత లాభంబు గాఁగ

గీ. నేను నీ వనుభేద మొక్కింత లేక
జగము తా నయి యుంట సంసారముగను
బరమవిజ్ఞాని భాసిల్లు నిరత మైన
సచ్చిదానందరససమాస్వాద మొనసి. 208.

గీ. వాఁడె యజ్ఞోపవీతి యవ్వాఁడె శిఖియు
వాఁడె సూ దారవంతుఁ డవ్వాఁడె పుత్ర
వంతుఁ డగు; వాఁడు పొందులాభంబు బ్రహ్మ
కైన హరికైన హరునకు నైనఁ గలదె. 209.

గీ. యజ్ఞసూత్రంబు కర్మాంగ మనిరి బుధులు
కర్మములె వీడుపోఁ దదంగంబు సూత్ర
మేల తాల్పఁగవలె? జ్ఞాన మెపుడు పొడమ
నప్పుడు శిఖఁ దాల్పకున్న నే మగుఁ గొఱంత. 210.

ఉ. కావున యజ్ఞసూత్రము శిఖల్ త్యజియించును యోగి కర్మముం
డావిలబుద్ధిఁ దాలిచి నిరంతరకర్మఫలానుభోక్తయై
పోవుచు వచ్చు చెందుఁ గడముట్టఁగఁ జాలక జీవభావముల్
దోవఁగఁ జాలఁ డంచు విబుధుల్ వచియింతురు పెక్కురీతులన్. 211.

సీ. కటిసూత్ర మాచ్ఛాదకముగఁ గౌపీనంబు
శీతార్తిఁ బాపి రక్షింపఁ గంథ
నక్షమాలిక సవ్రణాంచితవైణవ
దండంబు నుదకకమండలువును
మధుకరవృత్తిసంపాదితానేకాన్న
భుక్తి శిఖాసూత్రములవిముక్తి
నిత్యకర్మాదికనిరసనంబును బర
బ్రహ్మానుసంధానపాటవంబు
గీ. నిరతమును బూని జ్ఞానసందీప్తి నెనసి
మాక్తికప్రోతసూత్రసంభావనమునఁ
బరమహంస గనందగు బ్రహ్మతేజ
మాపిపీలిక మాబ్రహ్మమైన జగతి. 212

గీ. అనుచుఁ జకచక మనుదివ్యమైనవచన
రచన యతిశిష్యుఁ డాగ్రహింపధమ శిష్యు
నధరము మెదల్పనీయక యాతఁ డెట్టు
వంత విన వచ్చె మధ్యాహ్న మయ్యె ననుచు. 213

వ. తోడన గోష్ఠి చాలించి సాంతేవాసులై యతియుం గృహపతియు
నిశాంతాభ్యంతరమ్మున కరిగి మాధ్యాహ్నికక్రియాకలాపనిర్వర్తన
పూర్వకంబుగా భిక్షులు భోజనమ్ములు నిర్వర్తించుకొని విశ్రాంతి
నొలుంగకయ యప్పుడ గోష్ఠీమందిరము సొచ్చి వివిధవిద్వజ్జనసము

క్షణంబున నిరువాగుశిష్యులు సకలశాస్త్రసమ్మతంబుగా న్యాయము వాదముసేయఁ జూచుచు దివసావసానమున యథేచ్ఛ మ్మరిగి, రమ్మఱుదినమునుండి యథాపూర్వము సపరివారంబుగ పరిష త్తలంకరించి యుత్తరోత్తరము లగు ఛాతుర్యలవాదము లందలి జయాపజయం బుల మోదవిషాదము లొందుచు వచ్చుచుఁ బోవుచుఁ దదేకధ్యా నమగ్నమానసులై దివసపంచకం బేఁగించి షష్ఠవాసరమున వేఁ బోకఁ గరణీయంబులు తీర్చుకొని సభకు విచ్చేసి మాలాలంకృత కంధరులై శంకరమండనులు తామె వాదమునకుఁ బూనుకొని రయ్యవసరమున. 244.

ఉభయభారతీసాక్షికంబుగ శంకరుఁడును మండనుఁడును వాదమొనర్చుట.

శా. నానాదేశసమాగతుల్ బుధులు నానాటఁ గుముల్గట్టి యా
స్థానం బెల్ల నలంకరించి విన నుత్సాహంబుతో నుండ, శి
ష్యానీకంబులు నొజ్జలఁ గలసి యాయాగ్రంథముల్ చేతి కం
దీ నుండఁ గనవచ్చునాగరజనం బేసద్దు లేకున్నెడఁ. 215.

ఆ. సాధువాద మొకట సభ్యులు గావింప
శ్రుతుల సాక్ష్యమున స్వమతము నిలుపు
కొనుచు నొండొరులకుఁ గుతుకమ్ము మోదమ్ము
గూర్చునుడుల వాదు కొనలు నిగిడె. 216.

ఉ. ఒండొరులుఁ బ్రగల్భు లయి యుత్తరముల్ విదళించు చర్థిఁ గూ
ర్చుండి స్మితాంచితాననము లొప్పఁగ మేనుల స్వేదకంపముల్
మెండుకొనంగ మిన్నుదెస మిన్నక చూచుచు, నుత్తరంబు లే
కుండుచుఁ, గ్రోధవాక్ఛలము నొందుచు నుండిరి యిర్వు రయ్యెడన్.

గీ. అపుడు క్షోదక్షమం బైనయాబుధేంద్రు
దాక్ష్య మరసి యతీంద్రుఁ డుద్దవిడిఁ దూల్చె

శోభితాఖిలపక్షు సత్కోవిదాంతి
కాప్రకాశితకక్షుని నల విపక్షు. 218.

ఉ. అంతట మండనుండు స్వమతావననైపుణశూన్యుఁ డయ్యు వే
దాంతవచఃప్రసిద్ధ మయి యద్వయమార్గము సూపునట్టిసి
ద్ధాంతముల౯ బరశ్శతవిధంబులఁ దూల్చుచుఁ బల్కఁ జొచ్చె ని
క్లింతయు మచ్చరంబు జనియించి జయించుతలంపు మించఁగ౯ 219

క. శమధన! హేయోపాదే
యముల విడిచి సిద్ధ మగుపదార్థముఁ దెలుప౯
క్షమ మగువేదాంతోక్తులు
ప్రమాణ మనఁగఁ బొసఁగు నెటు పరిశీలింప౯. 220.

సీ. కర్తృతాధర్మయుక్తుఁడై క్రాలు జీవుఁ
డీశ్వరుఁ డకర్తృతాధర్మ మెనసి యుండు
నట్టి ప్రవిరుద్ధధర్మాశ్రయముల కెట్లు
లైక్య మమరుఁ? బ్రమాణ మిం దరయ మనిన. 221.

గీ. యతివరుం డను నుద్దాలకాదిగురులు
శ్వేతకేతుప్రముఖశిష్యవితతిఁ 'దత్త్వ
మసి' యనుచు నైక్య మెఱిఁగించి యలరఁ జేయు
వాక్యము ప్రమాణ మగు బుధవర్య! యనుడు. 222.

తే. హుంఫడాదులమాడ్కిఁ బాపోపశాంతి
కై జపార్హమ్ము లైనవేదాంతవిదిత
తత్త్వమస్యాదివాక్యము లర్థమ్మనను వి
వక్ష యెటు లొందఁగల్గుఁ జెప్పంగదన్న. 223.

శం. అర్థవిదులు హుంఫడాదిశబ్దమ్ము ల
ర్థప్రతీతిచే ననర్థ మనిరి

యర్థ మిట్లు తెల్ల ముగుచుండఁ దత్త్వమ
స్యాదికము జహార్థ మనుట యెట్లు? 224.

మం. వన్నుగఁ 'దత్త్వమసి' యనుట
విన్నన్ జీవేశ్వరుల కభేదము స్మృత మా
యెన్న మఖకర్త యీశా
భిన్నుం డనుస్తుతినిబోలి విధిశేష మగున్. 225.

శం. యూపముఖాధ్వరాంగములయుష్ణకరాదిసురాకృతిస్తవా
లాపము కర్మకాండపరిలబ్ధము గావున నర్థవాద తా
ప్రాపణ మొప్పుఁ గాని యెటు పల్కెదు తత్త్వమసీతివాక్య మా
రా! పరకాండదృష్టముగదా 'విధిశేషమ' యంచు ధీనిధీ. 226.

మం. మ. పవమానాన్న మనోద్యులాదియగు నబ్రహ్మంబునన్ బ్రహ్మబు
ద్ధి విధింపన్ జనుమాడ్కిఁ గర్మపరివృద్ధిం గోరి యాసూక్తి దాఁ
దివుచున్ జీవునినంక బ్రహ్మమనుబుద్ధిన్; గాన నారోపితా
త్మవిభాసం బగుఁజీవుఁ గొల్చునిగమాంతంబుల్ ప్రమాణంబులే 227

శం. మనమును బ్రహ్మమంచుఁ గొలుమా యనువాక్యమునందు బ్రహ్మభా
వనకు లిఙాదికంబు గనుపట్టినయట్టుల ధీవరా! విధా
ననియతి తత్త్వమాదివచనంబుల నున్నదె? జీవునే యుపా
సన మొనరించు నయ్యుపనిషత్తు లటంటివి సత్య మెట్లగున్. 228.

మం. చ. యతివర! రాత్రిసత్రమునయందు విధిన్ ఫలదర్శనాప్తి నే
గతి ఘటియింతు, రాపగిదిగా నిట ముక్తిఫలశ్రుతిన్ బ్రక
ల్పితవిధి యంచు నీశ్రుతి వివేచనసేయుట పాడి, కానిచో
వితథము గాదె యద్ది "పృథివీపతి రేవ" యటన్న కైవడిన్. 229.

శం. సరి నీ వన్నటులేని మోక్షము కి; మూజన్యంబ కాఁగన్ విన
శ్వరమా స్వర్గమువోలె, సల్పఁగను సల్పన్ మానఁగా నన్యమా

కరణిన్ సల్ప వశం, బుపాసన మనఃకార్యంబు దా నాట; న
క్కరణిన్ గామిని జ్ఞానలబ్ధ మగు మోక్షం బెన్న నిత్యం బగున్. 230

మం. తత్త్వ మసి యనుసూక్తి నీతలఁచినట్టు
లే యుపాసనాపర్యవసాయి గాక
పోవుఁగా, కీశ్వరునితోడ జీవునకును
దెలుపుచుండుట లేదె సాదృశ్య మనఘ. 231

శం. సాదృశ్యం బనఁ జేతనత్వకృతమా? సార్వజ్ఞ్యసార్వాత్మ్యధ
ర్మాదిప్రాప్తమొ? యేక్రియన్ దెలిపె—నాద్యం బంటివేనిన్ బ్రి
ద్ధోదంతమ్ము వచించు టెందులకు? నోహో యన్య మంటేని ద
ద్భేదస్థాపక తావకీనమతసూక్తిప్రాతికూల్యం బగున్. 232

మం. ఆత్మగుణనిభ సుఖవిబోధాదిగుణము
లలయువిద్యావృతిని జీవునం దభాస
మాన మగుఁగాక; నిత్యతామాత్రమునన
సామ్యము వచింప సుక్తదోషంబు తొలఁగు. 234.

శం. నీ వనువాక్యపఙ్క్తినె మనీషిమణీ! "పరమాత్మభావ మా
జీవున కబ్బు నా నలుకఁ జెందఁగ నెందులకయ్య? యయ్యవి
ద్యావరణంబునుండి పరమాత్మత కాప్రతిభాసశంక నీ
వే వెడలించినాఁడవుగదే నిజ మారయుమా మనంబునన్. 235

మం. జీవునకుఁ జేతనత్వమ్మచే జగత్ప్ర
సూతి యగునాత్మకును సాటిఁ జూపుత; జగ
మనఘ! చిజ్జన్య మగుట సాంఖ్యాదికథిత
మగుప్రధానాదివాదమ్ము లంతరించు. 236.

శం అటు లగునేని 'దత్త్వ మసి' యంటకు నీమతమందు 'అస్తి' యం
చటఁ బలుకన్ వలెంజుమి 'తదైక్షత' యన్నశ్రుతిన్ గనన్ జగ

ఘటితజడత్వశంక తొలఁగంగఁ దదీక్షణశబ్ద మొప్పఁగా
నటులు; ప్రధానవాదము నిరాసము సేయు టసంగతం బగుక్. 237.

మం. 'నాహ మీశ్వర' యనెడుభేదావగమము
తత్త్వమసివాక్యజన్యబోధమున కతి వి
రుద్ధమై యుండ నైక్యసంసిద్ధి కలదె?
యదియు స్వాధ్యాయవిధి జపార్థంబ నూవె. 238.

శం. భేద మెఱిఁగెడి శక్తి యవ్విషయుఁకున్న
నాదవెడి నభేదవాదవేదోక్తిబాధ
కరణమునకు భిదాసన్నికర్ష మమర
దెట్లు ప్రత్యక్ష మనెదు జీవేశ్వరభిద. 239.

మం. ఈశభిన్నుఁడ నే నన నెసఁగుభేద
శబ్ద మాజీవునకు విశేషణ మగుటను
గలుగుఁ దత్సన్నికర్షమ్మ; కరణభేద
ములకు * సంప్రయోగాభావ మెలయుచున్న. 245.

శం. కనద యతిప్రసక్త మగుఁ గానఁ దదేకవిశేషణత్వ మే
యనువున సన్నికర్షత; భిదాశ్రయ మింద్రియసన్నికృష్టమై
తనరినచో విశేషణత దాఁ గనఁజాలును సన్నికర్షతక్;
గనఁగదె సన్నికర్ష మెటు గల్గు నతీంద్రియ మైనయాత్మకుక్. 241.

మం. అరయ భేదాశ్రయ మ్మగునాత్మ కింద్రి
యమునసన్నికర్షమ్మ లే దంటి వహహా
ద్రవ్యములె కానఁజిత్త మాత్మయును వాని
కబ్బఁగాదె సంయోగసమాశ్రయతయు. 242.

* సంయోగాదికసన్నికర్షము లేకున్నను.

శం. ఆగుము పల్క కాత్మ విభువౌ నటుగా కణు వౌతఁ జిత్తసం
యోగిత రెండుపక్షముల నూహ యొనర్చినఁ గానరాద యో
* యోగివరేణ్య! సావయవ మొందును సావయవంబుతోన సం
యోగము, గాని తా నవయవోజ్ఝితుతో నెపుడేనిఁ బొందునే. 243

చ. మన సొకయింద్రియంబ యని మాటకు నంటిమి- లోచనాదికం
బునకు సహాయమాత్రమయి పొల్చును దీపమువోలెఁ గావునన్
మనసున కింద్రియత్వ మణుమాత్రము లే, దిఁక 'నింద్రియంబులన్
మనసును నేన యంట 'యుడుమండలిఁ జంద్రుఁడ' నన్నరీతి నౌ.

మం. అతులతతిని భేదజ్ఞాన మబ్బదేని
వరలుఁగాక సాక్షిస్వరూపమయి; దాని
తో విరోధ మెనయునీశజీవు లొక్కఁ
డన నెటు ప్రమాణ మాత త్త్వమాదికోక్తి. 245.

శం. అలయవిద్యావృతుం డైనజీవునకు మా
యావృతుం డగు పరమాత్మునకును
సాక్షిస్వరూపమై జానొందుప్రత్యక్ష
మెఱిఁగించు భేదంబు పరఁగినట్లు
యాశ్రుతి శుద్ధజీవాత్ములయైక్యంబుఁ
దెలుపు భిన్నాశ్రయంబులు గనుటను
నవిరోధ మగును- గా దంటేని ♦ పూర్వమై
వెలయుప్రత్యక్షంబు ‡బలవిహీన

---

* మండనుని సంబోధించుట.

♦ 'పౌర్వాపర్యే పూర్వదౌర్బల్యం ప్రకృతివత్' అను జైమినీ
యసూత్రము ననుసరించి 'ప్రత్యక్షము- శ్రుతి' యను నీరెండిటఁ బ్రి
ధమమగు ప్రత్యక్షమును చరమమగుశ్రుతి బాధించునుగదా పూర్వం

గీ. మఱి (3) యపచ్ఛేదనయరీతి ననుసరించి
చరమ మగుశ్రుతిచే బాధ పొరయఁ గాదె
మును గలుగురజతిజ్ఞానమునకుఁ బిదపఁ
గలుగు శుక్తిప్రమ ప్రబాధక మ్మగునటు. 246.

---

పర మజాతత్వా దబాధిత్వైవ జాయ తే। పర స్యానన్యథోత్పాదా న్నత్వబాధేన సంభవః' అను శాస్త్రమునఁ బరము పుట్టనికారణమునఁ బూర్వశాస్త్రము దేనిని బాధింపకయే పుట్టును. ఇఁకఁ బరశాస్త్రమో పూర్వశాస్త్రబాధకుఁ గాక యితరథా పుట్టనే పుట్టదు. కావునఁ బర మెల్లప్పుడు బాధకమే యగును. ఎట్లనః:— బ్రకృతియాగమమునఁ గృతోపకారు లగుకుశలు ప్రథమాతిదేశమున వికృతియాగమునఁ బ్రసక్తము లయ్యును గల్ప్యములును, జరమభావులు నగునిరపేక్షము లైనశరములచే బాధింపఁబడుట లేదా? అట్లే యుండును.

(3) అపచ్ఛేదన్యాయము:— బహిష్పవమానస్తోత్రము నుద్దేశించి యన్వారబ్ధముగా గమనము చేయుచుండు ఋత్విజులలో నుద్గాతకుఁ గచ్ఛాపచ్ఛేదము కలుగుచో 'యద్యుద్గాతాఽపచ్ఛిద్యేత అదక్షిణం యజ్ఞం నిష్పాద్య తేన పున ర్యజేత' యను శ్రుతిచే నారంభింపఁబడిన క్రతువును దక్షిణారహితముగ సమాప్త మొనర్చి, సదక్షిణాకముగ మరల యజ్ఞము చేయుట ప్రాయశ్చిత్తముగా విధింపఁబడె. ప్రతిహర్తకుఁ గచ్ఛాపచ్ఛేదము కలుగుచో 'యది ప్రతిహర్తాఽపచ్ఛిద్యేత సర్వవేదసం దద్యాత్' అను శ్రుతిచే సర్వధనదానరూప మైన దక్షిణతో నారబ్ధయాగము సమాప్త మొనర్చుట ప్రాయశ్చిత్తముగా విధింపఁబడె. క్రమమున నుభయాపచ్ఛేదము కలుగుచో, దొలిదాన దక్షిణారాహిత్యము, రెండవదాన సర్వస్వదక్షిణయును నుభయమునకు విరోధము కావున నుత్తరనిమిత్తకప్రాయశ్చిత్తముతోడనె యారబ్ధక్రతుసమాప్తి నొసర్పవలె' ననెడు నపచ్ఛేదన్యాయమునఁ బూర్వ మగు ప్రత్యక్షము పరమగు శ్రుతిచే బాధిత మగును.

మం. సంయమిరాండ్రి ఘటాదికసరణి జీవుఁ
డఖిలవి త్త్వము లేమిఁ బరాత్మభిన్నుఁ
డగు నసెడియనుమానాన నయ్యభేద
వేదమున కప్డు బాధ రాలేదె కనుమి. 247.

శం. నీవు నుడివినభేదమ్ము నిక్కవమ్మొ
కాల్పనికమో వచింపు నిక్కంబయేని
దవులు దృష్టాంతహాని రెండవదియేని
సిద్ధసాధనదోషంబు సెందు మరల. 248.

మం. వినుము స్వప్రత్యయాబాధ్యభేదవత్త్వ
మలఘటాదికమందు సాధ్యంబు నూవె
* యాత్మబోధముచే నబాధ్యప్రభేద
మొప్ప ననినంత నేదోష మున్నదయ్య. 249.

శ. ఎనయ స్వశబ్దము బోధిం
చినది సుఖాదులను జెందుజీవుఁ డనిన మా
♦ కు నభీష్టము-తదభిహి తే
శుని నన దృష్టాంతహాని చొప్పడు మరలన్. 250.

---

* ఘటజ్ఞానముచేఁ బటజ్ఞానము బాధింపఁబడనట్లే స్వజ్ఞానముచే నబాధిత మగు భేదము ఘటాదులందు సాధ్యము' అని మామతము. ఆత్మజ్ఞానముచే భేదమునకు బాధ లేదని నీమతము (అద్వైతము) నగుటచే సిద్ధసాధనదోషము తొలఁగినది.

♦ స్వప్రత్యయాబాధ్యభేదాశ్రయత్వరూపసాధ్యమునందు స్వశబ్దమున కర్థము సుఖాదుల నొందుజీవుఁడా? శబ్దహితుఁ డగుపరమాత్మయా? జీవుఁ డనినచో నట్టి భేదాశ్రయత్వము మాకును నిష్ట మగుటచే సాధింప నక్కఱలేదు. అనఁగా సిద్ధసాధనదోషము. పరమాత్మ యనినచో ఆత్మజ్ఞానముచే సర్వజ్ఞానములు నశించుఁ గాన దృష్టాంతమైన ఘటమందు ఆత్మప్రత్యయాబాధ్యభేదాశ్రయత్వరూపసాధ్యము లేదు.

మం. వ. యోగీంద్రా! మామతమం దీయనుమానప్రమాణమున జీవే శ్వరులకు నిరుపాధికము సాధ్యము. నీమతమున జీవేశ్వరుల కౌపా ధికభేదమే గదా. అదియు యగునెడల నుపాధియగు నవిద్య తత్త్వ జ్ఞానముచే నివర్తింప భేదమునకు మిథ్యాత్వము సిద్ధించుం గా వున నీవు సాధించునది జీవేశ్వరుల కౌపాధికభేదమును మేము సా ధించునది నిరుపాధికభేదము నగుటంజేసి సిద్ధసాధనదోషము పరి హృతం బయ్యెం గాదె. 251.

శం. ఆర్యా! నిరుపాధికభేదంబునకు (6) దృష్టాంతముగాఁ జూపఁబడిన ఘటేశ్వరభేదముగూడ నవిద్యోపాధిక మగుటచే నచ్చట నిరుపా ధికభేద మంగీకరింపఁబడమింజేసి దృష్టాంతహాని కలిగెను. మఱి యు నీయనుమానమున 'సాధ్యవ్యాపకత్వేసతి సాధనావ్యాపకత్వ ముపాధిః' అను లక్షణముంబట్టి బ్రహ్మనిరూపిత నిరుపాధికభేదము ఘటాదులందుఁ దప్పక యుంటంజేసి సాధ్యవ్యాపకమై, యసర్వ జ్ఞత్వరూపసాధనము గలజీవునియందు జడత్వము లేకుంటంజేసి సాధనావ్యాపకత్వము గల జడత్వ ముపాధి యగుటచే నీవు హేతు వనుకొనినది సోపాధికమై హేత్వాభాస మగుచున్నయది. మఱి యు 'ఆత్మా పరస్మా దభిన్నః, చిత్వాత్, పరవత్ (పరమాత్మ వత్) అను ననుమానముచే జీవునకుఁ బరమాత్మాభేదమును సా ధించు చిత్త్వరూప హేతువు గలుగుటంబట్టి నీచూపిన హేతువు స త్ప్రతిపక్షితము గూడ నయ్యెనే. 252

మం. వ. (బ్రహ్మపక్ష మగుననుమానము ప్రయోగించి సిద్ధసాధ్య త్వాదిపరిహారమును శంకించుచు) బ్రహ్మ జీవప్రతియోగిక ధర్మి ప్రమాఽబాధ్యభేదవత్ । సంసృతిశూన్యత్వాత్ । అని మేము సా ధించుచుంటంజేసి జీవభేదము బ్రహ్మజ్ఞానబాధ్య మని నీ వొప్ప

(6) దృష్టాంతము వాదిప్రతివాద్యుభయసంప్రతిపన్నమే కావ లయు నని శాస్త్రనియమము.

దానికి విపరీతమునే సాధించుచుండుటచే సిద్ధసాధనదోషము లేదు. ఘటాదిప్రమచే జీవభేద మబాధ్య మని నీ వంగీకరించుటంజేసి దృష్టాంతహానియు లేద 253.

శం. ఆజీవప్రతియోగికభేదము యావద్ధర్మిప్రమాబాధ్యము కా దనియా? యత్కించిద్ధర్మిప్రమాబాధ్యము కా దనియా? అచ్చట ఘటగతమైన జీవభేదమునకుఁ గూడ స్వధర్మిబ్రహ్మజ్ఞానబాధ్యత్వము స్వీకరించుటచే యావద్ధర్మిజ్ఞానాబాధ్యత్వము సంప్రతిపన్నము కామిం దృష్టాంతహాని ఘటిల్లుటంజేసి ద్వితీయపక్ష మాశ్రయింపనెంచ నందు స్వరూపాతిరిక్తభేదవాదిమతమున ఘటాదికమందును బ్రహ్మమందును గలజీవభేద మేక మే గావున నాభేదధర్మి యైన ఘటము సంబంధమగు జ్ఞానమున నబాధ్యమైన జీవభేదము బ్రహ్మయందు మా కంగీకృత మగుటచే నీకు సిద్ధసాధనదోషము. ఇంతియు కాదు. సాధ్యకోటియందలి ధర్మిపదముచే వివక్షితము సగుణమా? నిర్గుణమా? సగుణ మందువేని సగుణస్వరూపజ్ఞానముచే భేదమున కబాధ్యత్వము మా కిష్టమగుటచే సిద్ధసాధనదోషము నిర్గుణ మందువేని యదియు దోషాయుత్త మే యగు, నెట్లంటేని వినుము. ఆనిర్గుణస్వరూప మైనబ్రహ్మము తాను బక్షముగాఁ బ్రమిత (ప్రమాణసిద్ధ) మై యగునా? యప్రమితమై యగునా? అందు ద్వితీయపక్షమున నాశ్రయాసిద్ధి కలుగు, నికఁ బ్రథమపక్షమం దన్ననో:— జీవాభిన్నముగాఁ బరమాత్మ తత్త్వమస్యాది వేదాంతవాక్యములం బ్రసిద్ధ మగుటచే నీవు చూపిన యనుమానమువలన నావేదాంతప్రమాణమునకు బాధకలుగు 'జ్యోతిష్టోమో న స్వర్గఫలదః, క్రియాత్వాత్, మర్దనక్రియావత్'' అను ననుమానము 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అను వేదవాక్యమునకు విరుద్ధార్థబోధక మగుటచే నెట్లాభాసరూపమో నీయనుమానమును నట్టిద.

మం. (అనుమానస్థాపనమునం దసమర్థుఁడై యామార్గము వదలి శ్రుతి
విరోధము చూపనెంచి.)

ఉ. వాని చెలంగఁ "దత్త్వమసి' వైదికసూక్తిని మాల్చు 'ద్వాసుప
ర్ణా సయుజా'యటన్న *శ్రుతిరాజము జీవున కాత్మకుఁ భిదా
న్యాసము గల్గ నయ్యెరువురం డొకఁ డాస్థను బిప్పలాదియై
భాసిల; నొం డభోక్తయయి భాసిలు నం చెఱిఁగించి మస్కరీ. 255

తే.గీ. వినుము ప్రత్యక్షసిద్ధమై విఫల మగుప
రాత్మభిద కేల శ్రుతి మాన మగుట; నితర
థా తెలియఁగాదె యద్ది; స్వార్థమ్మునం ద
తత్పరము లయ్యు నర్థవాదములు దనరు. 256.

వ. అజ్ఞాతార్థంబునందె శ్రుతికిఁ బ్రామాణ్యము జైమిని చెప్పుటం జేసి ప్రత్యక్షసిద్ధమును ఫలరహితము నగుజీవాత్మభేదము దెలుప శ్రుతి యేటికి? తత్త్వమస్యాదివాక్యవిరుద్ధము లగు నేతాదృశశ్రుతులు స్వార్థమునం దతత్పరములయ్యు నర్థవాదతామాత్రములు గాకపోవు.

మం.క. శ్రుతిమూల మగుట గీతా
స్మృతిప్రసిద్ధార్థవాక్యరీతిఁ, బ్రమాణ
స్థితిఁ గనుఁ బ్రత్యక్షసమా
ర్జితార్థవాక్యమును నిగమజీవక యగుటన్. 258.

వ. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" యను గీతావాక్యమునకు మూల మగు తత్త్వమసి యనుశ్రుతి ప్రమాణమగు నట్లె ప్రత్యక్షముచే సిద్ధమగు నర్థము బోధించు 'ద్వాసుపర్ణా'యను నీయభేదశ్రుతియుఁ బ్రమాణమే యగును. 259.

*శ్రుతి. ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే తయో రన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి. అని

శం. వేదమూలం బగుట వేదవిత్స్మృత్యర్థ
మందు శ్రుతియ ప్రమాణమౌ నందువేని
యెటు శ్రుతి ప్రమాణ మగును జీవేశభిదను
శ్రుతిలవాజ్ఞులు సైత మెఱుంగుదాన. 260.

ఉ. ఆనిగమంబు జీవపరమాత్మలఁ జెప్పు నటంచు మాటమా
త్రానకు నంటేఁగా, కిది యదార్థము- సత్త్వమునుండి వేర్పడం
గా నలపూరుషుఁ దెలిపి క్రిచ్చఱ వానికి సర్వసంస్మృతి
న్యూనత పాదుకో నుడువుచున్నది తన్నిగమమ్మె యెన్నఁగన్ 261.

మం. దేవ యీ శ్రుతి సర్వజ్ఞజీవులను ద్వ
జించి తా సత్త్వజీవులఁ జెప్పునేని
జడమునకు భోక్తృతను జెప్పఁజాలు నేత
దాగమమునకుఁ బ్రామాణ్య మమరు టెట్లు? 262.

శం. నేము నీ కళంకనీయుల మౌ పైంగ్య
మగురహస్య మిట్లు వ్యాఖ్య సేసె
'సత్తి సత్త్వ' మంచు 'నభిపశ్యతి జ్ఞ' యటం
చు నదసీయ మంత్రమునకు సరిగ. 263.

వ. ఎట్లంటేని 'తయో రన్యః పిప్పలం స్వాద్వత్తీతి సత్త్వం, అనశ్నన్నన్యో అభివాకచశీ త్యనశ్నన్నన్యో అభిపశ్యతి జ్ఞః, తావేతౌ సత్త్వక్షేత్రజ్ఞౌ' అని పైంగ్యరహస్యము. పిప్పలభోక్త సత్త్వ మనియు నభోక్తయై సాక్షిమాత్రుఁడుగా నుండువాఁడు క్షేత్రజ్ఞుఁ డనియు వివరించుటం జేసి సత్త్వజీవులను గ్రహించిన మావాదము నీ కళంకనీయము. 264.

మం. ధీర సత్త్వశబ్దమ్ము శారీరవాచి
యగుట క్షేత్రజ్ఞపదము పరాత్మవాచి
యగుటఁ బైంగ్యరహస్యాదితాత్పర్యమునను
నల్లవాక్యమ్మునకుఁ దోఁప దన్యపరత. 265.

శం. పాత్రిప్తరూప! తదేతదిత్యాదిసూక్తిఁ
జిత్తమున సత్త్వపదవృత్తి సెప్పఁబడియె,
దానసే చెప్పఁబడియె క్షేత్రజ్ఞశబ్ద
వృత్తి శారీరకద్రిష్టవిషయమందు. 266.

వ. సత్త్వ మన నంతఃకరణ మనియు క్షేత్రజ్ఞుఁడన శారీరుఁడనియుఁ బ్రసిద్ధమగుటవలనను పైంగ్యరహస్యమందు నట్లే వ్యాఖ్యాతం బగుటవలనను రూఢియైనది. ఆపైంగ్యరహస్యమున (8) త దేత త్సత్త్వం యేన స్వప్నం పశ్య త్యథ యోఽయం శారీర ఉపద్రష్టా సక్షేత్రజ్ఞ స్తా వేతౌ సత్త్వక్షేత్రజ్ఞౌ' అనియుండె. కావున సత్త్వమనఁ జిత్తమనియు క్షేత్రజ్ఞుఁడన శారీరుఁ (జీవుఁ) డనియు నిశ్చితము. 267.

మం. 'యేన' యని స్వప్నదృశిధాతు వూని కర్త
చెప్పఁబడెఁ గాన నత్యాది జీవుఁడె యగు
నెట్టి క్షేత్రజ్ఞశబ్దాభిహితుఁడు స్వప్న
దృక్కు. నఖిలవిదుం డగు నీశ్వరుఁ డగు 268.

శం. అభిహితం బయ్యెఁ దిజ్ప్రత్యయమునఁ గర్త
యనఁ రెఁ గరణార్థమునఁ దృతీయావిభక్తి
ద్రిష్ట శారీరధర్మవిశిష్టు డగుట
యేనపదవాచ్యుఁ డనఘ! కాఁ డీశ్వరుండు. 269.

---

(8) యేన=సాధనమగు నేచిత్తముచేత, స్వప్నం=స్వప్నమును(క్షేత్రజ్ఞుఁడు) పశ్యతి=చూచుచున్నాఁడో, తదేతత్=అయ్యది, అనఁగా ఆచిత్తము, సత్త్వం=సత్త్వము. అథ, యః=ఎవఁడు, శారీరః=శరీరగతుఁడై, ఉపద్రష్టా=చూచువాఁడై యుండునో, సోఽయం=అట్టియీతఁడు) క్షేత్రజ్ఞః=క్షేత్రజ్ఞుఁడు. తౌ ఏతౌ=అట్టియీరాద్వయము, సత్త్వక్షేత్రజ్ఞౌ=సత్త్వమును క్షేత్రజ్ఞుఁడును. అనివ్యాఖ్య.

మం. శారీరపదమువృత్తి 'శ
రీరే భవతి' యనునర్థరీతి నగుఁ దదా;
ధారముగ వెలుఁగు నీశుఁడె
శారీరపదాభిధేయసమయమున నెసయున్. 270.

శం. ఈశుఁడు వెలుంగఁడే శరీరేతరమునఁ
దెలియ శారీరశబ్దాభిధేయుఁ డెట్టు
లగును? నభము శరీరమం దఖిలమందు
నుండుఁగద దాని శారీర మండు రెవరు. 271.

మం. జీవునిఁ బ్రాజ్ఞునిన్ దెలియఁ జెప్పక బుద్ధిశరీరభాజులన్
గేవల మిద్ది చెప్పనేల నిత్యజడం బగుబుద్ధి 'యత్తి' యం
చేవెర వూని భోక్త్రిగ యతీంద్ర! వచింపఁగవచ్చు, నట్లయే
నీవు ప్రమాణ మెద్ది వచియింతువొ చూతుము గాక యియ్యెడన్.

శం. ఇను మదాహక మయ్యు దా ననలయుక్తి
దాహకతఁ గాంచుగతి నచేతనమ యయ్యు
బుద్ధి చిదనుప్రవేశము పొందుకతన
భోక్తృధర్మంబుఁ బొందుఁ బ్రబుద్ధబుద్ధి! 273.

మం. నీడయెండధోరణిని జీవుఁ డీశుండు
గనఁగ భిన్ను లనుచుఁ గాఠకములఁ
బరఁగు; శ్రుతి "ఋతం పిబంతౌ" యని యభేద
వేదబాధకమ్ము గాదె యదియు 274.

వ. ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే, ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి పంచాగ్నయో యేచ త్రిణాచికేతా, అనికఠవల్లీస్థయగుశ్రుతియు "ఋతం కర్మఫలం, పిబంతౌ-పానప్రయోజ్యప్రయోజకౌ" యనితద్వివరణమును ప్రమాణములు 275.

కం. వ్యవహారసిద్ధిభేదము
వివరించు చబాధక మ్మభేదశ్రుతి కా
చవులను భేదశ్రుతి కది
యవు బాధక మత్యపూర్వ మగుటఁ బ్రబలమై. 276.

మం. మానాంతరోపబృంహిత
మానాభేదశ్రుతియు బలాఢ్య యగుటచే
మానాంతరవిధుతార్థం
బా నైక్యశ్రుతికి యతివరా! బాధక మా. 277.

వ. ఇందుఁ బ్రమాణాంతర మనఁ బ్రత్యక్షప్రమాణము యుపపన్న మగు. దాన నుపబృంహితం బగుట భేదశ్రుతి బలిష్ఠమై యాప్రత్యక్ష బాధితార్థ మగు నభేదశ్రుతిని బాధించునే కాని యభేదశ్రుతి భేద శ్రుతిని బాధింపనేరదు. 278.

కం. నిగమజ్ఞ! ప్రమాణాంతర
మొగిఁ బ్రబలములుగ నొనర్ప నోపక శ్రుతులన్
దగ దుర్బలములుగాఁ జే
యఁగడంగునుజుమి గతార్థతాదానాదిన్. 279.

క. అని యీతీఱున శంకరుఁ
డనయము వాదించి మండనాస్యపిధానం
బొనరించెఁ దత్కళత్రం
బనుమోదింపఁగఁ దదీయ మగువాదంబున్. 280.

వ. అట్టియెడ సభ్యులసాధువాదంబు లొక్కపతి మిన్నంటి దేవతూర్యంబుల నతకరించె. 281.

—♦ ఆ శ్వా సాం త ము ♦—

మ. దివిషత్తూర్యధిమింధిమిస్వనమిళద్గీతిస్ఫురద్దానవా
హావరంగాత్తజయేందిరాశుభవివాహాశీఃప్రముక్తాఫలో
త్సవసంసూచకపుష్పవర్షనిబిడద్యావాపృథివ్యంతరా
ళవలక్షద్యుతిలిప్తకీర్తిలలనాలాస్యోర్ధ్వవేద్ధాకృతీ!

క. పుణ్యాజనపణ్యాపుణ్యావి
గణ్యా! ఖరదూషణాదిశతపస్విద్రు
ట్పుణ్యాజనాగ్రీణ్యమితా
రణ్యానీదావదహన! ప్రశమితకుహనా!

ఉ త్సా హ ము .

నల సుషేణ మైంద వాలినంద నార్కనంద నా
నిలజ జాంబవ ద్గవాక్ష నీల ముఖ్యకపిచమూ
విలసనాత్త విజయపూర్తి! వేంకటాఖ్య మంత్రిహృ
జ్జలజ సతతవాస లోల! తరణివంశ వార్తికా!

ఇది శ్రీ గురుకరుణాసమాసాదితకవిత్వ "కవితాభూషణ"
వెంపరాల సూర్యనారాయణనామధేయప్రణీతంబైన
శం క ర వి జ యం బు న

చతుర్థాశ్వాసము.

——

# శ్రీ శంకర విజయము.

## పంచమాశ్వాసము.



శ్రీయుత! యింాదరవేంకట
రాయామాత్యార్చితాంఘ్రిరాజీవ! ముని
ధ్యేయైకజ్యోతీరూ
పా! యామ్నాయాంతదివ్యదాకృతి! రామా!

వ. దేవా! అవధరింపుము.

—మండనుని శిరాజయము—

శా. సంధ్యానానటదిందుశేఖరశిరశ్చంచద్ద్వియన్నిమ్నగా
వంధ్యోర్మిస్ఫుటఘుంఘుమారవసదృగ్వాగ్గుంఫసౌభాగ్య మా
సాంధ్యంబుం బచరించి శంకరుఁ డనుచ్ఛ్వాసంబుగా మండనుం
వింధ్యాహార్యము సూర్యునట్లు నిలిపెం వేదాంతివాదంబులం. 1

క. గిరిశిఖరనిస్సరన్ని
ర్ఝరధారాధోరణీవిరాజితమై వా
క్తరుణీచరణాంగదరవ,
పరిహాసకమై తదుక్తిపఙ్క్తి సెలంగెం. ౨.

ఉ. సభ్యులుమందహాసవిలసన్ముఖులై యతి మెచ్చ వైమనీ
లభ్యయశఃప్రకాండవికలత్వము మండనుఁ డొందెఁ, దత్సతీ
బిభ్యదుదారచిత్త మసభీష్టము తెల్పక తీరమిం వ్యథా
క్షుభ్యదుదంత మయ్యె సభ ఘూర్ణిత మయ్యెను దక్షణంబునం. 3

శా. దక్షుండై యతిమాళి నించెను సుధావాప్రిఖౌసదృశ్శ్లోక్తివై
చక్షణ్యంబులు విశ్వరూపమహిళాసంమానముం గాంచి యా

ధ్యతుత్వంబున మించి సభ్యుల కమందానందసంధాయులై
విక్షోభం బొదవించె మండను మనోవీథిన్ గళన్రిగుప్రిచిన్. 4.

గీ. ఉభయభారతియును భర్త యునమునందు
వాఁడి వ్రేలెడు సుమమాలవంకఁ గాంచి
కాంచి నిలువెల్ల స్వేదప్రకంపనములు
గండరువు నా నచేష్ట యై యుండు సంత. 5.

ఉ. దుర్మతఖండనైకనిరతుం డగు శంకరు నైగమాంతవా
గూర్ముల నాగ్రహం బుడిగియున్ విచికిత్సఁ జలాచలాత్ముఁడై
కర్మజడుండు గేస్తనియె 'గాసిల నేఁటి పరాజయార్థ మా
నిర్మలజైమినీయమతనిర్మథనార్థము కుందినంతగన్. 6.

ఉ. నైగమకర్మమార్గఘటనాచతురుండు తపస్వి యాగతా
నాగతవేది లోకహితయత్నుఁడు జైమిని వ్యర్థసూత్రక్ర
ద్యోగము సేయువాఁడె? యని యుల్లము తల్లడ మొందు' నన్న న
య్యోగివరుండు పల్కె విశదోక్తుల డెందము కందళింపఁగన్. 7.

క. కానంతయేని యపనయ
మాసంయమివంకఁ బొడము, దజ్ఞుల మాటల్
వీసంబు నెఱుఁగఁ జాలుదు
మే సత్యాత్మనమానిహృదయాం బనుదున్. 8.

గీ. పండితాజ్ఞేయ మంటి వహ్నారికాంక్షి
హృదయ; మది యెట్టిదయ్యె వర్ణించి చెపుమ
యుక్త మని తోఁచెనేని నీయుక్తి దశద
హాంక్రియుఁడనై గ్రహింతు నిండారు మదిని. 9.

క. అని మండనపండితుఁ డన
విని శంకరదేశికుఁడు వివేకమునన్ వం

దనపూర్వముగా నా జై
మిని పాండిత్యాదికము సమిద్ధతఁ బల్కెన్. 10.

మ. వినుమా జైమిని సచ్చిదాత్మకలనాభిప్రాయుఁడయ్యెన్ జగ
జ్జనముల్ నైపుయికేచ్ఛ మున్గుటను దత్సంతారణార్థంబు బ్ర
హ్మనిదానాప్తికిఁ సాధనం బైన పుణ్యంబెన్నఁ గర్మప్రవృ
త్తి నిరూపించెను దత్త్వదర్శ మగు కీర్తిన్ జాతకారుణ్యుఁడై. 11.

క. జ్ఞానావబోధకహేతుక
మైన 'తమేతి' మను వచన మది ధర్మచయో
త్థానకముగఁ జూపుటఁ ద
న్మానియు మోక్షేచ్ఛ వని సమర్థింతు మిటన్. 12.

వ. అదియెట్లంటేని వినిము 'తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివి
దిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన' యను శ్రుతి బోధోత్పత్తికి
హేతువగుటం జేసి బ్రహ్మచర్యాదికధర్మంబుల నాచరింప విధించు
చుండెఁ దద్వచనాపేక్షకంబుగా జైమిని బ్రహ్మనిరతుండ కానఁ
గర్మ మవశ్యాచరణీయ మని నిర్ణయించె. నియ్యది యయ్యనఘు
నభిప్రాయం బనుటయు. 13.

గీ. అడిగె నిటుల గృహస్థు "క్రియార్థకంబు
లగుట శ్రుతులు సఫలము లన్యార్థకోక్తు
లెల్ల వృథ" యని సూత్రించి ఋషి శ్రుతులకె
సిద్ధవస్తుపరత్వ మేబుద్ధిఁ బలికె. 14.

వ. 'ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్య మతదర్థానా' మను సూత్ర
మునందు గ్రియార్థకంబు లగుటం జేసి శ్రుతులు సఫలము లగు నక్రి
యార్థకంబు లగు వాక్యంబులు నిరర్థకంబు లని జైమిని వచించియు

నిగమవాక్యాలె సిద్ధవస్తుపరములని యేల తలంచెనో యని సందియ
మొందుచుంటిని. 15.

చ. అనుడుఁ బరంపరాగతి హితాధ్వయ మయ్యును వేదరాశి దాఁ
గనుఁగొన నాత్మబోధఫలకం బగు కర్మముచేఁ గృతార్థమై
తనరుటఁ గర్మకాండ భణితంబులు కర్మపరంబు లంచు జై
మిని విరచించినాఁ డని యమిప్రవరుం డన మండనుం డనుఁగా. 16.

గీ. అఖిలవేదములకు సచ్చిదాత్మపరత
యభిమతం బేని జైమిని,కపురుష మగు
కర్మమున కేల ఫలదాతృకత వచించు
నేల పరమేశు నిరసించు సిద్ధచరిత. 17.

వ. అనుటయు శంకరుండు. 18.

సీ. కర్తృపూర్వక మీజగం బను ననుమాన
మే యీశుఁ బ్రకటింప నింక వేద
మనువాద మాత్రమై యలరుఁ గా''కనెను కా
ణాదసిద్ధాంతమ్ము నరసి మాని
యశ్రుతివిదు లోప రౌపనిషదపురు
షు నెఱుంగనంచు నాశ్రుతులె తెలుప
ననుమాన మోపునే యనుభావమున నీశ
పరమైన యనుమాన మురలునట్లు
గీ. యుక్తిశతముల నిరసించు చొగిని జగము
పుట్టుట వశించుటయు ఫలంబును సమస్త
మీశ్వరుని వంకఁ గా వనియెను మదుక్త
మంతయును జైమినీయాశయమ్మె సుమ్ము. 19.

చ. అపిదితతన్నిగూఢమహితాశయులై బుధు లమ్మునీశ్వరుఁ
దనిలి 'నిరీశవాదియు యితం డను నంత నిరీశవాదిగా
నవునె పరాత్మవిన్మణి? యహస్కరదీప్రమయూఖపుంజముఁ
బవలు నిశాటనాహితతమంబు మలీమసముఁ బొనర్చునే. 20.

మండనుని సంశయములు తొలంగ జైమిని ప్రత్యక్షమై చెప్పుట

క. అని యిటు జైమిని హృదయం
బును యతిశేఖరుఁడు దెలుప బుధుఁడును సభ్యుల్
వనితావతంసమును గని
రనన్యసామాన్యమైన యానందంబున్. 21.

గీ. అంత నప్పండితుఁడు విదితాశయుండ
యయ్యుఁ గించిద్విశయుఁడై హృదంతరమునఁ
దద్వచఃశ్రమజిజ్ఞాసఁ దలఁచు నంత
జైమినియుఁ గోచరించి యీసరణి ననియె. 22.

క. విను భాష్యకారుఁ డగునీ
యన నాసూత్రముల కెద్ది యర్థ మని వచిం
చెనొ యది నాహృదయము సుమి
మనమున సందియము వీడుమా యిఁక సుమతీ. 23.

క. గురుఁ డటు చిదేకరసత
త్పరతన్ శ్రుతిశీర్షభాషితములకుఁ దెలుపన్
బెఱరీతి నొక్కసూత్రము
విరచింతునె తదుపలబ్ధవిజ్ఞానుఁడనై. 24.

క. చాలింపుము సందియపడు
టాలింపుము దెల్పెదను రహస్యం బిటఁ గు

ద్వేలభవమగ్నలోకము
పాలింపఁ జనించి నట్టి పరమాత్మ సుమూ. 25.

ఉ. ఆదియుగంబునన్ గపిలుఁ డన్యయుగంబున దత్తమౌని యా
మీఁది యుగాన వ్యాసుఁ డటుమీఁదియుగంబున శంకరుండు జ్ఞా
నాదిక మిచ్చి ప్రోత్తు రిల నంచును శైవపురాణ ముండె నీ
వీవమిచక్రివర్తి మతమే గ్రహియింపు తరింపు సంసృతిన్. 26.

మండనమిశ్రుఁడు శంకరుని స్తుతించుట.

గీ. అనుచు మండను బోధించి యతిలలాము
మనమునం గౌఁగిలించి జైమిని తిరోహి
తుండయిన యంత నయ్యతీంద్రునకు మ్రొక్కి
యాయజూకావతంస మిట్లని నుతించె. 27.

క. ప్రకృతివి జగములకు సమా
ధికరహితుఁడ వతులబోధ దేహుఁడ వయ్యుం
వికలాత్ములఁ బ్రోవఁగ భౌ
తిక దేహుఁడ వైతి వని మదిం నినుఁ గంటిం. 28.

ఉ. ఓయతివర్య! యౌపనిషదోక్త్యది తైకపదంబుఁ దత్త్వమ
స్యాయుధ మీవు గైకొని నిరంతర మౌరయ వేని భ్రష్టతా
ప్యాయనసౌగత ప్రలపితాంధకకూపపిచండపాతమున్
బాయఁగఁ జాలునే ప్రియభావముఁ గాంచక యున్న యింతకుం.

చ. కలఁ గని మేలుకొంటి ననుగాఢమతిం గలయందె యన్య మా
కలఁ గను మూర్ఖరీతి నవగాఢతమోవశు లౌచుఁ గొంద ఱా
త్మలఁ బరలోక మందు టమృతత్వ మటంచుఁ దఃంతు రట్టివా
రలఁ గని నవ్వుచుందురు నిరాకృతమాయులు తావకాశ్రితుల్. 30.

ఉ. ఆరయఁ గర్కశాముఖరమై గతసారము నా భవంబుఁ బోఁ
గోరవి భేదవాదిమతకుత్సితయుక్తి యిపీ యదేల?? యో
ధీర! త్వదుక్తయుక్తిఫణితిన్ గనఁ జూతు సదాతనంబు సం
సారహరంబు చిత్సుఖరసప్రద నిర్ఝరమాట నీపయిన్. 31.

ఉ. రాక్షసకామినీవృత ధరాసుత నీకు ప్రియన్ గనంగ నే
యాక్షితి వాయుసూతి నుతికెక్కెను, మింగిన యాశకై యని
ద్యాక్షణదాచరీజఠరదారణమున్ బచరించి యాశు న
ద్వీక్షణపాత్రుఁ జేయు భవదీయమహత్త్వ కియత్త యున్నదే. 32.

క. జగదార్తిహరణచణ! భవ
దగణితమహిమంబు దెలియ కాముని వాదిం
పఁగడఁగిన మదపరాధము
తగ క్షమియింపఁగదె సూరత ప్రథముఁడనై. 33.

గీ. అప్రమేయప్రతిభు లౌకణాదకపిల
గౌతమాదులె వేదసంఘాతభావ
నిర్ణయ మొనర్ప మోహ మొందిరి యనంగఁ
జాలుదురె యన్యు; లోకశివాంశంబుదక్క. 34.

మ. అమృతాసారకిరద్భవద్వదనజాతాలాపపీయూషభా
స్సముదాయంబు దిశావకాశముల మించన్ జిత్తమాలిన్యబీ
జములై కూడినకాణభుక్కపిలపశ్యత్ప్రోద శాస్త్రోక్తిసం
తమసస్తోమముతోఁ బ్రయోజనము కానన్ వచ్చునే లేశమున్.

సీ. దేవుని భేదించి గోవుల భజింపఁ
దివిరెడు నభినవయువననివహ
మవని యంతయుఁ బర్వె, నవ్వారి సేవించు

నవ్వారి కెచ్చట నెవ్విధమున
ముక్తి గల్గునె యంచు ము న్నహర్నిశము
జింతించు చుందుదుఁ జిత్తమంద
వద్వాదిరాజు లుత్సారితకలిమలుల్
విష్ణుతత్త్వాభినివిష్టమతులు

గీ. పరమనిపుణులు నైన భావత్కశిష్య
కుంజరులు సర్వదిక్కులు గూడముట్టి
జృంభణము నూప నిఁక నేల చింత నొంద
సత్వభావితభావ! యాచార్యదేవ!. 36.

గీ. మందమతికృతవివరణదండకూక
విక్షతిహతంబు లగు శ్రుతుల్ విమలయుష్మ
దుక్త్యమృతసేక మొదవక యున్న వరలఁ
జాలునే యాత్మవిధృతానుశయము లగుచు. 37.

గీ. తీవ్రతరదుస్సహాభవోష్ణదీధితిప్ర
బలతరాతపజాతతాపంబు శాంతి
నందునే భవదీయసూక్త్యమృతకరమ
యూఖసంపర్కముచేఁ దక్క నొండొకంట. 38.

ఆ. అకట! కర్మయంత్ర మందెక్కి శ్రుతతపో
దారపుత్రగేహదానవిత్త
ముల జనించు మానమునఁ గూలు నన్నెత్తి
తల భవాంధకూపబిలమునుండి. 39.

క. తొలుబాముల దుష్కర మగు
నలఘుతపము చేసికొంటి; నటుగాక కృపా

జలధి! జగదీశ నీతోఁ
గలుగున యీవాదజల్పకథ లిటు నాకున్. 39.

సీ. శమరూప పూర్వపుణ్యమున కంకుర మెద్ది
దమ సముద్గతి కెద్ది తలిరుటాకు
నై భాగ్యవిటపికిఁ గోరకం బెది సహా
నత్వవల్లికి నెది ననలజొంప
మేకాగ్రతాసుమ బృందంబునకు నమం
దమరందబిందు సంతాన మెద్ది
సంతతశ్రద్ధకు సముదితఫల మెద్ది
ధీరవృత్తులకు విందేయ మెద్ది
గీ. పరమగురువర్య! యట్టి తావక మనోజ్ఞ
వచనపరిచయమును బూర్వభవసహస్ర
సముపలబ్ధ సంఖ్యాతీతసారపుణ్య
పటుపరీపాకమునఁ గాదె పడయఁగంటి. 40.

గీ. నాకసంవాసులకుఁ బూరుషార్థ మొసఁగు
భుజసి భవమగ్నజనులకు మోక్ష మొసఁగు
సత్కృపోర్మిళి నీకటాక్షఝరి దలఁప
ధన్యుఁ డగువాఁడ మున్ను నద్దానియందు. 41.

చ. పొలఁతులచన్నుదోయి పయిఫుట్టపుఁగొంగు దొలంచి ముట్టి కోఁ
గిలిగొని వాళిఁ జొక్కి కరఁగించి రమించుచుఁ గొంద అందుఱ గా
కలఘుయశోర్జులై నిపుణులై తగువీరలు దేశికేంద్ర వా
గ్గళితసుధాఝరీప్లవనకౌతుకులై విహరింతురు ధీరతన్. 42.

చ. తిమిరహారంబు లౌ విశదదీప్తుల భాసిలు ధ్యానతంతుగుం
ఫమిళితభావకోక్తిపృథుమౌక్తికహారములన్ ధరించి మ్రో

దమునఁ జరించు వీరిఁ దనుఁ దాన వరించును హృద్య విద్య య
య్యమరవరాదులన్ గొనక యంతటి భూష బుధాళి కున్న దే. 43.

ఉ. వేదవికాసహేతు వగు విశ్రుతతావకకీర్తికిన్ బుధుల్
మోదముఁగండ్రు గాఁ కలనభోమణిదీప్తికి గూబ లట్లు మో
హోదధి మున్గుతన్ ఖలసముత్కరముల్ గురుశంకరార్చనా
సాదితమోహరాశి నయి శాశ్వతికాత్మసుఖాబ్ధి దోఁగెదన్. 44.

సీ. సంతానశాఖ యుష్మచ్చింతనమ్ము నం
దనవనమ్ము భవత్పదప్రణామ
మమరభూరుహావల్లి యనఘ! భవత్సమా
రాధనాతంత్రిదుర్వార వాంఛ
మందాకినీనది సుందరభవదీయ
వరగుణనికురుంబవర్ణనంబు
స్వర్గంబు నేత్రగోచర మా భవచ్చర
ణాంభోజయుగళంబునర్హణంబు
గీ. గానఁ బ్రాజ్ఞు లనూనచింతానిధాను
లగుచు భవదాశ్రయము గాంచి యాత్మలందుఁ
దృణసమంబుగ గణియింతు త్రిదివజగము
సచ్చిదానందధుర్య! యాచార్యవర్య! 45.

గీ. కాన సంతానకాంతానికాయ్యవిత్త
ములను గార్హస్థ్యకర్మశృంఖలఁ ద్యజించి
శరణముగ వరియింతు నీచరణయుగళి
కరుణ నను నేలుకొనుము కింకరుని దేవ. 46.

చ. అని యిటు మండనార్యుఁడు యథార్థతఁ దద్గుణముల్ నుతింప, వి
చ్ఛిన్నమది నాత్మవేది గురుశేఖరుఁ డప్పు డనుగ్రహించి యా

తనిఁ గొన నెంచి వాని సహధర్మచరిణ్ గన, నాపెయుణ్ యతీం
ద్రుని మహితాశయంబును గనుంగొని యల్లనఁ బల్కెఁ నీక్రియణ్.

—: భారతి తనపూర్వ వృత్తాంతమును జెప్పుట:—

క. యతివర! యెఱుఁగుదును భవ
న్మతిఁ దొల్లిటఁ దెల్పె నొకఁడు మానీంద్రుఁ డనా
గత మగునావృత్తం, బ
క్కృతను వచించెదను శ్రద్ధగా విను మనఘా! 48.

ఉ. శైశవమందు మజ్జననిసన్నిధి నుండ నొకప్డు వచ్చె మా
నీశుఁ డొకండు పింగళగుదీర్ఘతటిత్ప్రతిమానజాటజూ
టీశిరుఁడై త్వగావృతకటీరుఁడు నై సకలాంగలిప్తభ
స్మాళితికాంతిమండలుఁడు నై వసుధాగతశంభుఁడో యనణ్. 49.

గీ. వచ్చినమునీంద్రునకు నర్ఘ్యపాద్యముల నొ
సంగి నాతల్లి మ్రొక్కి నంజలి ఘటించి
నాభవిష్యచ్చరిత్ర మంతయును దెలుపఁ
బ్రార్థన మొనర్చె నిటు లనురాగ మొలుక. 50.

క. మహనీయ! యెఱుంగను నా
దుహిత భవిష్యంబు; తెలియుదు తపో మహిమణ్
మహితాత్ములు ప్రణతులకుం
బహుళకృప రహస్య మెఱుకపఱచెదరు గదే. 51.

ఉ. ఈయమ కాయు వెంత? సుతు లెందఱు గల్గుదు రెట్టి వాఁ డగుణ్
నాయకుఁ? డధ్వరంబుల నొనర్చునొకో? ధనధాన్యపూర్ణ యౌ
నే? యని భావ్యదంతమును బృచ్ఛ నొనర్ప నిమీలితాక్షుఁడై
యాయతి పల్కెఁ జూచినక్రియణ్ మదుదంతము నెల్లఁ జిత్ర మా.

ఉ. ధారిణి వేదబాహ్యమతధాటికి వేదపథంబు గూల నం
భోరుహసూతి యుద్ధరణమున్ సలుపన్ జనియించు బ్రాహ్మణా
కారవిహారుఁడై; గిరిశు గాఁచి, హరిన్ సిరివోలె, నమ్మహా
సూరిని నీవె పెండ్లియయి సూనులఁ గాంచును గాంచు సౌఖ్యముల్

గీ. అంతట దురంతకుమతకృతాంత మయి వి
నష్ట మగునాపనిమదసన్మతము ప్రోవ
మానుషాకార మూని యీశానుఁ డవని
నిజపదాబ్జవిన్యాసమండిత నొనర్చు. 54.

క. యతిరూపుఁ డైనగౌరీ
పతితో నీకూఁతుపతికి వాదము గలుగున్
జితుఁ డగు విస్మృష్టగృహుఁ డయి
గతి నీ నని కొలుచు నాజగద్రక్షకునిన్. 55.

గీ. అని చనియె నమ్మునీంద్రువచోనుసార
ముద్భవించినదాది నా దోట యెఱుఁగ
నట్టిమత్పతి వేదవేదాంగవేత్త
జితు నొనర్చితి నీవ నూ శివుఁడ వార్య. 56.

—: భారతి శంకరునితో వాదింపఁ గోరుట:—

ఉ. ఐనను నామనోహరు సమగ్రముగా జితుఁ జేయు టైతి సా
మే నగునన్నుఁ గెల్చి కొనుమీ యితనిన్ నిజశిష్యుఁగా యతీ
శాన! లభించుఁ బూర్ణజయశంసలు నీకు, భవాదృశున్ మహా
జ్ఞాని నెదిర్చి వాదము నొనర్పఁగ నాకును వేడు కయ్యెడున్. 57.

క. అనియాయజ్ఞాకవరవ
ర్ణిని యనపేతార్థమును ననింద్యము మధురం

గను ఘర్మతప్తుఁ డటు ల
వ్వనిత తనూతాప మపుడ వాయఁగ దట్టెన్. 18.

గీ. తా ననంగుండ యయ్యుఁ జిత్తమునఁ గరఁగి
యమితమోహాంధతమసాపహర్త యతఁడు
తల్లి యిదె వచ్చినాఁడ సంతాప ముడుగు
నిపుడ యొడఁగూర్తు నీకోర్కె లేమి యనుచు. 19.

క. చిరమున కనామయుని సుతు
నరయుట హర్షించి మంద మగు స్వరమున ని
త్రతి భాగ్యమ్మునఁ గుశలిని
నరసితి నిను నింతకంటె నభిమత మున్నే. 20.

ఆ. నేఁడు వేగుఁబోక నిన్నుఁ దలంచితిఁ
బ్రాణ మింక దేహమందు నిలువ
దనుభయంబు నూని యన్న యొచ్చో నున్న
వాఁడొ యెపుడు వచ్చువాఁడొ యనుచు 21.

ఉ. పుత్ర! జరాతిశీర్ణ నుగుమూర్తి భరింపఁగఁజాల, దీనికిన్
బాత్రతఁ గల్గ శాస్త్రవిధిపద్ధతి సంస్కృతిసేసి భవ్యచా
రిత్రక! పుణ్యలోకచిరవృత్తి నొసంగఁ గదన్న! యన్నఁ దా
పత్రయవారకుం డతఁ డభంగవిమోహు మొసంగుభావనన్. 22.

శంకరుఁడు తల్లికిఁ దత్త్వోపదేశము సేయుట.

చ. అమితము, నద్వితీయము, మహాసుఖరూప, మపాస్తమాయ, మ
చ్ఛమహిమ, మప్రమేయమును స్వప్రభమున్ విగతామయంబు జ
న్మమృతిజరాదిదూరము సనాతన మాపరమాత్మతత్త్వమా
యమ కుపదేశమిచ్చె సనకాదివినుత్యుఁ డతండు భక్తిమై. 23.

గీ. అపుడు జనయిత్రి యను సౌమ్య యగుణ మాత్మ
నాకు రుచియింప దీక సగుణమ్ము రమ్య
మైన దైవతమును దెల్పు మకట! బుద్ధి
కంద దేక మనాకార మగుపరాత్మ. 24.

ఆ. అనుచుఁ దల్లి యన దయాళుఁ డాయతి
భుజంగప్రయాతవృత్తకవనరీతి
భక్తి శివు నుతింప భవుఁడు ప్రసన్నుఁడై
యనిపె నాత్మదూతలను ద్రుతంబ. 24.

ఉ. శూలపినాకపాణు లగుచుక్ జనుదెంచిన ఫాలనేత్రుదూ
తాళిని గన్నులారఁ గని యాయమ వీరలవెంటఁ బోవఁగాఁ
జాల నటంచుఁ బల్కుటయు శాంకరదూతలఁ బోవ వేఁడి స
చ్ఛీలుఁడు శంకరుండు వినుతించె రమాధవు నాదరంబునన్. 25.

వ. అంత.

సీ. కమలామృదూరుభాగప్రసారితపాద
సరసీజయుగళు నాజానబాహు
నీళామహీకరాలోలచామరవీజి
తుని వినతాసుతస్తూయమాను
దేహభృదస్త్రాధిదేవతాపంచకా
ర్చితుఁ దమాలాసితద్యుతిశరీరు
నుదయదుష్ణమయూఖసదృశరత్నకిరీటు
నుత్ఫుల్లపుండరీకోపమాక్షు

గీ. భుజగరాజన్యభోగతల్పుని ముకుందు
సుతుఁడు వినుతింప నారూపె మతి ధరించి
పరమయోగీంద్రకరణి సంసరణ మెడయఁ
దన్మయత నొంది యార్యాంబ తనువు దొఱఁగె. 27.

చ. అంత శరత్కలానిధికరామలదీప్తి చలద్ధ్వజాఢ్యమై
గాంతము నౌవిమానమును గైకొని వచ్చిన విష్ణుదూతలన్
శాంతమనోజ్ఞవేషులఁ బ్రసన్నులఁ గాంచి సుతుల్ నుతించున
శ్రాంత విమానమం దునిచి గ్రక్కునఁ దోడ్కొని వార లేగఁచో.

గీ. అర్చి, రహ, రాద్యపక్షమ్ము లతికరించి
నుత్తరాయణ మబ్దమ్ము లుత్తరించి
పవన రవి విధు తటి దబ్ధిప హరి విధిజ
గంబులను దాఁటి పరమపదంబు చేరె. 29.

శంకరుఁడు స్వయముగఁ దల్లికి నుత్తరక్రియలు నెఱవేర్చుట.

ఉ. ఆయెడ గేహముల్ పొలము లర్థములున్ దన వెల్ల గొన్నగో
త్రీయులఁ బిల్చి యీయమ మృతింగనె నుత్తరకర్మ మీరు శా
స్త్రీయముగా నొనర్పుఁ డనఁ జెంతను బుత్త్రుఁడ వుండి మమ్ములన్
జేయుఁ డటందు వేల తగునే యిటు పల్కఁగ నీకు శంకరా. 30.

గీ. నీయభావమ్మునం దేము చేయువార
మాత్మజుఁడు చెంత నుండియు నౌర్ధ్వదైహి
కక్రియలు తల్లి కొనరింప జ్ఞాతిజనుల
కిటు నియోగించు టాలింప మెచట నెవుడు. 31.

చ. అనుటయు సంయమీంద్రుఁడనునక్కటయింతటివాఢ్యమొందునుం
డునె చరమాశ్రమస్థితు ననున్ గృహిధర్మముఁ బూను మందురే
జనని యటంచు వచ్చితినె చక్క వినుండు ముముక్షు వీమె, శా
వునఁ దదభీష్టమున్ నెఱవుపూన్కిన వత్తు నొసర్తు నిష్టమున్. 32.

క. పూర్వాశ్రమసంబంధము
సర్వము తెగె నాకు, మీరు జ్ఞాతుల రేత

త్సర్వస్వ మనుభవించుచు
గర్వంబున శాస్త్రపథము గాదనఁ దగునే. 33.

మ. మమతల్ నే నరుదెంచినాఁడ ననుచున్ భావింపఁ బాపంబు ని
ర్మమతన్ గర్మము లుజ్జగించి శ్రుతిధర్మం బోముచున్ జ్ఞానవ
ర్త్మమునన్ సంసృతిభీతు లౌజనుల సంరక్షింప దీక్షించున
త్తములన్ సంయములన్ గృహస్థునటువల్కన్ నాల్క యెట్లాడెనో.

శా. ధర్మాధర్మవివేచనన్ మఱచి యర్థంబే ప్రధానంబుగా
దుర్మోహంబున బ్రుంగి శాస్త్రవిదులన్ ద్రోపాడి పాపంబునన్
నిర్మగ్నాత్ములు గాఁదలంతురె? విధానిష్ణాతు లౌ పెద్ద లీ
మర్మంబున్ వివరింతురు పోయి యడుగన్ భావ్యంబు మీకియ్యెడన్

ఆ. గురువు నౌదుఁ గాని కొమరుండఁ గా నీపె
కేను సన్యసించి యేఁగి యుంట
నిదిగో చనుచు నుంటి నీకర్మలోపంబు
పఱచు మిమ్ముఁ గంఠపాశ మగుచు. 34.

సీ. ధృతి సర్వసంగపరిత్యాగినై యేఁగు
నా కింతికలుషంబు సోఁకఁ బోదు
నను సన్యసించుపుత్రుని గన్న యీమె కే
కర్మలోపములు మోక్షమ్ము చెఱుప
నీకర్మలోపంబు మీకులంబులు తర
తరములు చెఱుపక సురిఁగిపోవ
దర్థాశ విహితకర్మానుష్ఠితిఁ దొఱంగు
ఖలులఁ బూతుల శ్రుతుల్ సలుపలేవు
గీ. శాస్త్ర మాచారముఁ దలంచి సత్పథమునఁ
బొందు ఫోకున్నఁ గులహాని పుట్టితీఱుఁ

గేరళమున కకీర్తి చేకూఱు నూర
మఱయుఁడీ తప్పుత్రోవను మరలుఁ డీరు. 37.

క. అని ధర్మము లెంతగఁ జె
ప్పిన జ్ఞాతిచయంబు పెడచెవిని బెట్టిరె కా
ని నిదానింపర యతిపతి
వనుపానరింపకయ యిట్లు పలికిరి పెలుచన్. 38.

సీ. పితృకర్మ మొనరింపఁ బిఱుతివిసిరె యతీ
శ్వరులు వారికి లేవె శాస్త్రవిధులు
యతి నంటి వవులఁ బ్రాయశ్చిత్త మొనరించు
కొనఁదగు నిది త్రోసి చనఁగఁ దగద
యాత్మజుం డెట్టివాఁ డౌఁగాక పితృపార
లౌకికవిధులు సల్పంగఁ గర్త
తదభావమునఁ గాక దరి కేఁగ నన్యుల
కధికార మిసుమంత యైన సున్న
గీ. విహితకర్మము మానుసీవిధమున నవి
హిత మొనర్చినమేము నిష్కృతివిరహిత
మైనప్రత్యవాయమ్మున కగ్గ మాదు
మిందు నందును గతులు లేకుందు మకట. 39.

ఆ. ఇది గృహస్థకృత్య మే మన్నయట్లీవు
సేయవలయు నొండు సెప్పఁదగదు
కా దటందువేని బోదుము నీయిచ్చఁ
జేసికొనుము మాకుఁ జెప్ప కనుడు. 40.

క. ఆపలుకులకుం గనలుచు
నీపై శ్రుతికర్మబాహ్యు లీ రయ్యెద రం

చాపాపచరితులకు యతి
శాపమొసఁగ యతిని దిట్టి చని రెటకేనిక. 41.

క. అది ధర్మ మిది యధర్మం
బది కార్య మ్మిది యకార్య మని తోఁపద దు
ర్మదులమదికి భగవంతుం
డెదురఁ బడి నిజమ్ము దెలుపనీ యెటు గానీ. 42.

శా. శాపం బిచ్చి యతీంద్రుఁ డాత్మజననీసంతారకుం డయ్యె సం
తాపం బందుచు 'వీడి పోఁ దగ దనాథప్రేతసంస్కారరూ
పాపద్ధర్మ మి'దంచు మాతృశవదాహార్థంబు వైశ్వానరం
బాపల్లెం గలవారి వేఁడ, నిడరై రాపుల్కస మ్మెవ్వరున్. 43.

ఉ. తా నఖిలజ్ఞుఁడే యగుత ధర్మము సెప్పుమ మున్ శపించి య
ద్దానికి సిద్ధమయ్యెనె యధర్మము గాదొకొ తా నొసర్ప వై
శ్వానర మిం డటంచు మము శప్తుల నేఁ డెటు వేఁడ వచ్చె? ని
ప్పైన నొసంగ మారసెద మాశవ మెుక్కఁ డెటుల్ దహించునో

క. అనువార కాని యచటికిఁ
జనువా రనలమ్ము నొసఁగి సాయపడఁ దలఁ
చినవారు లెక్క కొకరును
గనరా రతిచిత్రి మూరఁగలమెవ్వారుక. 45.

మ. అటు లింటింటికిఁ బోయి 'ని ప్పడిగి వ్యర్థాయాసుఁడై శంకరుం
డట నున్నట్టి నిజాన్వవాయులయకృత్యం బెంచి కోపించి యం
తటఁ దన్మాత్రిపసవ్యదోర్మథనమున్ గావించి దీప్రాగ్ని న
ప్పటఁ బుట్టించి దహించెఁ దత్కుణపముక వాసోపకంఠస్థలిక. 46.

క. దహియించి యాదురాత్ముల
బహుళాహంకారపంకపటల మిగుర న

మ్మహితుఁడు వా రందఱ శ్రుతి
బహిష్కృతులుగా శపించి వదలక వారిన్. 47.

ఆ. యతులు మీగృహమ్ములందు భిక్ష యొనర్ప
రిఁక గృహోపకంఠమే స్మశాన
మగును మీ కటంచు నతిఘోరశాపమ్ము
నిడియె నీట నగ్గి వొడమినట్లు.

క. అదిమొద లాదేశస్థులు
చదువరు శ్రుతి, యతులు భిక్ష సలుపర తద్దే
హ్యాదవసితముల, స్మశానము
సదనాంతికభువియె గాఁగ జరుగును నేఁడున్. 49.

చ. అకట మహానుభావులయెడాటమునన్ బచరించుబుద్ధిపూ
ర్వక మపరాధ మేరికి శుభంబు ఘటించును? శాంతుఁ డంచు మి
న్నక సుజనున్ వ్యథాకులు నొనర్పఁ బ్రమాదము; చందనద్రుశా
ఖక యని రాపువెట్టఁ బటుకీలలతో ననలంబు పుట్టదే? 50.

మ. తిలకింపన్ యతిమాళి చేసిన దశాస్త్రీయంబుగా నున్నఁ గే
వలధర్మావనబుద్ధిఁ జేయుటను నాపద్ధర్మ మాఁ దాదృశో
జ్జ్వలతేజస్కులు దూల్చి వైచెద రవశ్యంభావ్యధర్మక్రియా
కలనాయాతము ప్రత్యవాయముఁ దపోగాఢప్రభావంబునన్. 51.

గీ. అద్ది ధర్మవ్యతిక్రమంబట్లు తోఁచు
నరయ సాహస మా నది యైన;నమ్మ
హాత్ము లొనరించి రని యన్యు లాచరింప
రాదు మోస మా నవరదౌర్బల్యమునను. 52.

క. లోకావనార్థజన్మల
లోకాతీతప్రవృత్తి లోకుల కెపుడున్

స్వీకారము కా; దీక్షఁ ద
ద్వ్యాకులతె గ్రాహ్యమ్మ లంచు వాకొనును స్మృతుల్. 53.

చ. ఇటు జననిన్ మునీంద్రసమభీప్సితమున్ వితమస్కమున్ సుఖో
త్కటముఁ బునర్జనుర్విరహితం బగుసద్గతిఁ జేర్చి యాతఁ డం
తట ధరఁ బాడుకొన్నవిమతంబు లడంపఁగ దీక్షఁబూని ప
ర్యటనవిలంబనమున్ సలిపి సజ్జపదాగమనంబు గోరుచున్. 54.

పద్మపాదుఁడు దక్షిణదిగ్యాత్ర నొనర్చుట.

ఆ. మున్ను గురుననుజ్ఞఁ జన్నట్టియప్పద్మ
పదుఁ డుదీచ్యతీర్థపటలిఁ గొల్చి
చనె నవాచిదిశకు సకలామయఘ్నకు
నెందుఁ గలశజన్ముఁ డెపుడు నుండు. 55.

చ. కనె సుభగోరగాభరణకమ్రితనున్ బృథులింగసన్నిధా
నుని గరుణారసాప్లుతమనోయుత యానుమఁ గూడి మాళిఁ జం
ద్రనికళఁ దాల్చి సమ్ముదఘనుం డగువానిని గాళహస్తినా
థుని సురపాదిదైవతనుతున్ శివు నయ్యతి గాఢభక్తిమై. 56.

శా. స్నానం బాడి యతండు కాంచనముఖీస్వచ్ఛాంబుపూరంబునం
దానంత్యంబున భావపుష్పనికరం బర్పించి యగ్గించె వా
క్ప్రీనృత్యమ్మున భక్తిపూర ముబుకన్ శ్రీకాళహస్తీశ్వరున్
జ్ఞానానందమయుప్రదీపకళికన్ జ్ఞానప్రసూనాంబికన్.

గీ. కాళహస్తీశునమ్మతిఁ గాంచి, కాంచి
కరిగెను బవిత్ర మగుక్షేత్ర మగుటఁ దెలిసి
భవమహోదధిసంతితీర్షువుల కదియ
తరణసాధన మనుచుఁ బెద్దలు వచింతురు. 58.

గీ. ఆత్మభాగ్యాతిశీతిచే నచటివిశ్వ
పతిని నేకామ్రనాథుని నతులఁ గొలిచి
యంతకాంతకుఁ డగురుద్రుహార్ద మరయ
వన గృహాంతర్గత యగు కామాక్షిఁ దెలిచె. 59.

వ. మఱియు నాతిదూరమున నలశారుపురాణపురుషుఁ గరుణారసస్నిగ్ధ స్వాంతు ననాదిమధ్యాంతు లక్ష్మీకాంతుఁ గల్గాలేశుఁ గాంచి నుతించి, యచటఁ గదలిశుచిస్మితవదనమునఁ బార్వతీరూపపరిణత యగునాదిమప్రకృతికిమాత్రము గోచరింప సదా నృత్యము సలుపు సదాశివునివాస మగుపుండరీకపురమున కరిగి, నిర్మలస్వాంతంబును దివ్యచక్షువునై మునిజనంబు తన తాండవము చూచి జన్మమృత్యుజరాభయ మపనయించి తరింప నేత్రమనోవినోదకారకుం డగు పరమేశ్వరు భజించి శివభక్తులం గని తత్తీర్థమహాత్మ్య నడుగ నందొక్కఁ డిట్లు తత్తీర్థము నెఱిఁగించె. 60.

ఉ. భక్తుల కోర్కెమై శివుఁడు భావమునన్ స్మరియింప గంగ యా
సక్తిని జెంతఁ బాఱుటఁ బ్రజల్ శివగంగ యనంగఁ దీర్థమై
ముక్తి శివాజ్ఞచే నొసఁగు మున్గినమాత్ర నఘంబు వాసి స
ద్భక్తులు గాంతు రీశ్వరునితాండవ మందురు కొంద ఱుత్తముర్.

క. కొందఱు నాట్యంబున శ్రమ
మందిన శివుఁ దేర్ప శివయె యమరాపగ రూ
పొంది ప్రవహించుటన యిది
పొందెను 'శివగంగ' నామము నటం డ్రిమ్మిన్. 62.

చ. నటదభవోత్తమాంగకపినద్ధచలాచలజాటజూటసం
పుటగళితాభ్రగాంగజలముల్ ప్రణటత్తటరుద్ధనిర్ఝరీ
త్రుటితపతత్కణంబు లయి తోడన పార్శ్వమునుండి జాఱి పా
ఱుట శివగంగ నాఁగఁ బనరుఁ దదభిఖ్య యటండ్రు పండితుల్.

చ. అనితరసాధ్యభక్తివివశాత్మకుఁడై నరుఁ డేఁగి గంగలో
మునుకలు వెట్టివెట్టి మఱి పుంగవకేతనుపాదపద్మముల్
కనుకలి ముట్టిముట్టి హృదిఁ గ్రిన్నన శోధన చేసిచేసి తా
ననవరతంబు గాంచఁగలఁ డంగజసంహరుదివ్యనాట్యమున్. 64.

క. శివగంగ మునింగి యుమా
ధవునిన్ గనుఁగొన్నఁ నరుసుదారసుకృతవై
భవము వివరింప దక్షుఁడు
భవుఁ డొక్కం డగును గాక పరు లర్హు లొకో! 65.

గీ. అన విని పయోజపదుఁడు జితాత్ముఁ డభవ
యోజితాత్ముఁడై సమ్మదం బూని తీర్థ
మందు మజ్జన మొనరించి యఖిలలోక
భర్త యగుశంభుపదముల వ్రాలి మ్రొక్కె. 66.

ఆ. అచటు వాసి దశరథాత్మజకృతసేతు
దర్శనార్థ మరుగఁ దలఁచి యయ్యు
నుత్తముఁడు మునీంద్రుఁ డొయ్యనఁ జనువాఁడు
సరణిఁ గనెఁ గవేరజాప్రవంతి. 67.

క. క్షీరోదవాసరసికుఁడు
వారిజనాభాదినామవర్ణితుఁ డగునా
హైరణ్యచేలునకుఁ గా
వేరిపులినసీమ నుంట వేడ్కయఁట మదిన్. 69.

గీ. సహ్యపర్వతకన్యాప్రసన్నతరప
యోభిషిక్తముల్ భగవత్పదాబ్జములు ద
లంచి బహుశిష్యగణము సేవించుచుండ
వెడలె నభిరుచితస్థలి వేగఁ జేర. 69.

పద్మపాదుఁడు మేనమామ యిలు సేరుట.

క. పోవుచు మధ్యేమార్గ
మ్మావిమలుఁడు మాతులునిగృహమునకు బహుశి
ష్యావృతుఁడై చేరుటకు సు
ధీవరుఁ డగుమేనమామ దేలె ముదబ్ధిన్. 70.

వ. అంత నయ్యెడ నున్నసుహృద్బంధుగణంబు లప్పద్మపాదుఁ జూడ
గుములుగట్టి యొక్కపఱి వచ్చిరి. 71.

ఉ. వచ్చినవారిలోఁ నొకఁ డవారితసమ్మదజాశ్రు వయ్యె, వా
విచ్చి యొకండు గోడ్వడె, నవేళ ముదం బొకఁ డందె, నొక్కఁ డ
త్యచ్ఛముగా హసించెఁ, బ్రియదోన్నతి నొక్కఁడు ప్రాక్చరిత్ర వా
క్రుచ్చెమితోక్తి; మ్రొక్కె నొకరుండనుముల్ దిగమ్రింగి వైచుచున్.

చ. ప్రియదము మీఱ వానిఁ గని బాంధవు లిట్లని రార్య! యెంతకా
లమునకుఁ గాన వచ్చి? తఖిలం బగుబంధుత హార్దపూర్ణచి
త్తములను గోరు నీదుశుభదర్శనభాగ్యము నొంద, నేమి పా
పమొ యొకమాఱునేనిఁ గనుపట్టవు చుట్టఱికంబు వోయెనే. 78.

క. కలుగరు సుతులు సఖులు బం
ధులు యతికిన్ రాజబాధ తోఁప దెపుడు చో
రులవలనిభీతి పొడమదు
తలఁప యతిత్వము కృతార్థతామూలము సూ. 74.

గీ. సుమఫలాభ్యంచితంబుఁ బ్రాంశువు సశాఖ
సోపశాఖాక మగుశాఖి నుర్విజనులు
పీడ వెట్టెడుగతి ధనాన్వితు దరిద్రు
లండఁ జేరి పీడించెద రనుదినంబు. 75.

గీ. రాదు నిష్ఠుర, లేదు శర్మము కుటుంబ
రక్షణవిలు ప్తచిత్తు లౌవ్రిజల కింక
దేవతాభ్యర్థనం బేడఁ? దీర్థయాత్రి
యేడ?వ ర్థన్నిషేవణం బేడఁ దలఁప. 76.

ఆ నీవు సన్న్యసించునావా ర్త వింటిమి
తెలుప నొక్కవిప్రకులుఁడు తొల్లి
యెంతకాల మైన నీవు రా విపుడు నీ
ర్థముల కనుచు వత్తు దైవవశత. 76.

సీ. సౌఖ్యమ్ము నొసఁగుపృథ్వీజముల సమాశ్రయిం
చియు వానివిడుచువిహ్వరములట్లు
పరక్లప్తమఠసురావసథమ్ము లాశ్రయిం
చియు యతి వానిఁ ద్యజించి యేఁగు
సుమముల వ్రాలి సారము సంగ్రహించి భృం
గములు తద్రస మానుకరణి వెలయు
నిల్లిల్లు దిరిగి యోయిరము భిక్షించి త
త్సార మాని తపస్వి సౌఖ్య మొందు
గీ. ఘనవిరాగోదితాత్మవగతియ భార్య
తనువె భవనంబు మతి సంయుతంబె సుఖము
ధృతవిరాగులు శిష్యులే సుతులు గాఁగ
నలరుయతులకు నర్థనీయంబు గలదె. 78.

ఉ. దారపరిగ్రహార్థము సదా మనుజుం డొనరించి యత్నముల్
దార లభింపఁ బుత్త్రులఁ గనన్ మదిఁ గోరెడి, నిల్లి కోర్కులన్
సారెకుఁ బర్వలెత్తి కనఁజాలఁ డొకింత ఫలంబు ధాత్రిఁ జే
కూరునొకో సమాప్తి యని కోర్కుల కారయ నెన్నఁడేనియున్.79.

గీ. కోరుకొన్నట్టికోర్కి చేకూరదేని
యమితదుఃఖంబు గను నరుం డభిలషితము
తొలుఁగ నేరఁడు కామతత్పరున కెందు
వెతలె కాన ధరింప నౌ మతి విరక్తి. 80.

ఆ. అనఘ! చిత్తశుద్ధి యగు మూలము విరక్తి
కదియు మూల మగు మహాన్నిషేవ
కందు రౌ గాన దిరుగుచుందురు భవాదృశు
లుర్వి నల్దిశలఁ బరోపకృతిగ. 81.

క. అజ్ఞాతగోత్రులై బ్ర
హ్మజ్ఞానుల యయ్యు జడులయటు కనఁబడుచున్
ప్రాజ్ఞులు ప్రాణ్యనుకంపా
భిజ్ఞు లయి చరింతురు విషయవిముఖతె వెలయన్. 82.

క. చరియింతురు లోకసంగ్రహ
పరులై తీర్థములు శుద్ధభావులు మహితుల్
దురితవిదూరులు వారలు
కరమున సోఁకిన జలంబె ఘనతీర్థంబౌ. 83.

గీ నీదు దర్శన మనుపమామోద మొసఁగె
నుంతు కతిచిద్దినంబు లోపండిత! యిట
నేఁగఁగల వంచు నేమ్యద్విమోగచకితు
లగుచు బంధువు లిప్పుడే వగచుచుండ్రి. 84.

సీ. నాట్యమందిర మనంతక్లేశములకునౌ
హాసకృత్యముల కెల్ల నాశ్రియంబు
ప్రాసాదరాజంబు పైశున్యమున కన
శ్లాలాపకోటికి నాలయంబు

హింసావిశేషాతిమాంసలమ్ము హిరణ్య
బహుళతృష్ణాలతోపఘ్న యష్టి
ఖలజనోరగసముత్కరవామలూరువు
జ్ఞానవంతులకు స్మశానభూమి
గీ. యగుగృహం బాశ్రయించుకొన్నట్టిక్రూర
చరితులము మేము నీసాంద్రకరుణఁ జిలికి,
శుద్ధుల నొనర్చి యతిచంద్ర! యుద్ధరింప
కున్న నోయన్న! యెన్న మా కున్న దిక్కు. 88.

క. అని వాత్సల్యము దైన్యము
నినుమడియగాఁ బలుకులందు నెసఁగ మెసఁగఁ బ
ల్కినతనచుట్టములకు ని
ట్లనియెఁ బరివ్రాట్టతం డుదారార్థమునన్. 89.

గీ. అధికతాల్పత్వములఁ నెంచ కదిర! దేహి
కూర్చు దైవమె యోగవియోగములను
నుండవలె నిర్వికారచిత్తుం డయి నరుఁ
డిష్టము ఫలించినను ఫలియింపకున్న. 90.

ఆ. అన్నదాత యెవ్వఁ డగు నా కటంచు మ
ధ్యాహ్నవేళ క్షుత్తృడార్తి వచ్చు
నతిథిక్షుత్తు దీఱ నన్నంబు నిడ్డ సు
శీలు పుణ్యమహిమఁ జెప్పఁ దరమె. 91.

ఉ. స్నాన మొనర్చి యగ్ని నిరుసంజను వేలిచి తాల్చి, దండముం
బూని మృగాజినంబు శ్రుతిఁ బోలఁ బఠించుచుఁ జేరువర్ణిచం
దానన మధ్యాహ్నమున దండియు గేస్తులయిండ్లు సేరు బి
క్షానకునై యతాత్ముఁడును శాస్త్రవదావదుఁ డౌచు నిచ్చలున్.

ఆ. తనువు నెవని యన్నమునఁ బెంచుకొనుచుఁ ద
పంబు సేయు నత్తపస్వితపము
దక్కు నట్టియన్నదాతకు సగము ద
క్కును సగమ్ము కర్తకు ననె స్మృతులు. 93.

చ. అరయ విచక్షణుం డగుగృహస్థు గృహస్థితుఁ డయ్యుఁ గ్లేశముల్
బొరయక తైర్థికుల్ గనెడుపుణ్యము నొందు; ధనాఢ్యుఁడేని యం
దఱును గృహస్థుఁ జేసికొని దానముచేతనొ ప్రీతితోనొ త
స్కరగతినో బలాత్కృతినొ చక్క భుజింతురు తదీయవిత్తముల్.

క. తనుపఁదగు వేడపిడు వి
ప్రుని దాన సమస్తనిర్జరులు తనియుదు ర
య్యనఘునియం దఖిలసురలు
ననయము వసియింతు రనె స్వాయంభుగ శ్రుతియే. 95.

సీ. నిజధర్మనిష్ఠులు నిఖిలార్థవేత్తలు
విజితేంద్రియులును సేవితనమస్త
తీర్థుల్ పరోపకృతివ్రతుల్ మహితు
లేఁ తెంతురు గేస్తు నిశాంతమునకు
కావునఁ దత్తీర్థసేవాఫలంబు గే
హమువనుండియె తద్గృహస్థుఁ డొనయు
గృహికి టఁజావాసమే తీర్థ మగుట వ
దాన్యుండు గావలె ధనికుఁ డెపుడు
గీ. మూషికాద్యంతరస్థితిమ్ములును గోమ్రు
గాభ్రగాదిబహిస్థమ్ము లైనజీవ
సృష్టి జీవించు గృహి నాశ్రయించి కాన
గేస్తు సర్వోత్తమునిగ నంకింతు మదిని. 96.

గీ. తనువు మూలంబు పురుషార్థములకు నన్ని
మాతనువునకు మూలమం చనె నిగమము
లన్న మొదవ మూల మ్మాగృహస్థు మాకు
నఖిలఫలము గృహస్థాశ్రమాశ్రయంబ. 97.

క. మఱిమఱి చెప్పెద వినుఁ డా
దరమునఁ బూజింపుఁ డతిథిఁ స్వగృహమున కా
తురుఁడై రాఁ బూజితుఁ డు
ద్ధరించు, ధిక్కృతుఁడు కులము హరియించు వడిన్. 98.

క. చేయుఁ డనభిసంధిగ నా
మ్నాయోదితకర్మములు, సమస్తము పరమే
శాయత్తము సేయుం, డటు
సేయంగాఁ జిత్తశుద్ధి సిద్ధించు వెసన్. 99.

చ. జవమునఁ గౌఁగిలించు నెలజవ్వని మన్వపుఁ బైఁటఁ ద్రుళ్లుచ
న్గన నునుఁజందనద్రవమునన్ విలసిల్లునురమ్ము తోడివా
రవుదురె కాక వీ; రిఁక మహాయతివర్యపదాబ్జపూజనో
త్సవగతపాపులై దయయు ధర్మము గల్గి తరింతురు గా కొగిన్. 100.

చ. అని తనబంధువిప్రతతి కబ్జపదుం డుపదేశ మిచ్చి స
ల్పె నపుడు భిక్ష మాతులునివేశమునందు; భుజించి కూరుచుం
డినతఱి మేనమామయు వినేయుని కేలఁ గలట్టిగ్రంథమున్
గని యడిగెన్ సరోజపదు'గ్రంథ మిదేమి'యటంచుఁ బ్రీతిమై. 101.

—: పద్మపాదుఁడు తనభాష్యటీక మేనమామకడ దాఁచుకొని యరుగుట :—

క. మామ యన నసామాన్యుఁడు
మీమాంసాశాస్త్రమున నమేయప్రతిభా

ధాముఁడు ప్రాభాకరమత
గామి యఖిలవేదవిదుఁ డఖండయశస్సంపూర్ణా. 102.

ఆ. అంతవాఁడు తన్ను నాదృతి నడిగె నం
చపరిమితముదంబు నంది యార్య
వర్య! శంకరార్యభాష్యమునకుఁ డీక
యనుచు మామ కద్ది యరయ నొసఁగె. 103.

ఉ. కాంచి తదీయటీక మతికౌశలికిన్ ముద మొందెఁ గాని యిం
చించుక యొంట రెంటఁ గనియెన్ వెత, తద్రచనాచమత్కృతిన్
గాంచినమోద మన్యమతఖండనలక్షితదుర్గ్రహోక్తియు
క్త్యంచితరీతి న స్తమయ మయ్యెను మామకు నేమి చోద్యమో. 104.

క. స్వాభిమత మై తనర్చెడు
ప్రాభాకరమతమునకు నిరాకరణం బా
యాభాగమ్ములఁ గని మది
క్షోభించి యసూయ మాటికొని వినుతించెన్. 105.

ఆ. అపుడు భాగినేయుఁ డనె మాతులునకు నే
తువు భజింపఁ బోవుదును ద్వదాల
యమున గ్రంథ ముంచి యరయు మోయార్య! నా
ప్రాణ మెల్ల దానిపై నె యుండు. 106.

గీ. ఇతరులకు నొగృహాదులయెడల నెంత
ప్రేమ ముండునో యంత సంప్రీతి పుస్త
కములయెడ మా కటంచు నాగ్రంథ మప్ప
గించి వెడలెను సేతువుఁ గాంచు కోర్కె. 107.

చ. అటు చనఁ జూచుచు ప్పదరె నాయతివామభుజోరునేత్రముల్
తటుకునఁ దుమ్మ నొక్కఁ, డఖిలం బది కాంచియు దుర్నిమిత్తసం

కటత గణింప శాతఁ డధికం బగు వేడ్కఁ జనెన్ సశిష్యుఁడై
యెటు విధి త్రిప్ప నట్లె. భ్రమియించుట నైజగుణంబు ప్రాణికిన్.

శా. చింతించెన్ మది నప్డు మాతులుఁడు 'స్వీయుండు పేర్కొన్నసి
ద్ధాంతంబుల్ గురుపక్షహాని సలుపన్ దక్షమ్ము; లీగ్రంథమున్
సాంతంబున్ దహియింప, నాగురుమతం బవ్యాహతిన్ వ్యాప్త మా
నిం తేలా యన; వాక్యలన్ పలుఁపరా దీగ్రంథ మావంతయున్.

ఆ. నైజపక్షనాశనముకంటె గృహనాశ
నంబు మే లగుట గృహంబుతోడఁ
బుస్తకము దహింతుఁ బొడ గానరా దంచు
నింటి కగ్గి వెట్టె యిట్టు లేడ్చె 110.

ఉ. అక్కట! జాలిమాలి గృహ మగ్ని యిదే దహియించుచుండె జెం
పెక్కిన సర్వసంపదలు నీక్రియ బూడిద యాట కేనవన్
దక్కక మేనయల్లునమితశ్రమ మాకృతి కేద్తు నింటిలోఁ
జిక్కి నశించె నే మనుచుఁ జెప్పుడు రే పతఁ డేఁగుదేరఁగన్ .111.

గీ. అనుచు విలపించె నని యెల్లజనులు చెప్ప
గొనెను నైతిహ్య మీవిరచనకు మూల
మగు మొనర్చెడువాని కెంతగు ఫలంబు
దాని కినుమడిగాఁ జెప్పువాని కబ్బు. 112.

పద్మపాదుఁడు దర్భశయనాదిపుణ్యస్థలముల కేగుట.

మ. అటు లాపద్మపదుండు శిష్యసహితుండై యేఁగుచోఁ ద్రోవచ
క్కటి ఫుల్లశ్రీవరాశ్రమంబు గన రాఁగాఁ బొంగి యం దేఁగి న
చ్చటఁ ఘమున్ రాముఁడు రావిచెట్టు మొదలన్ జాపంబు దాన్నుంచి నీ
స్తటచింతన్ జలరాశిలో మునిఁగెనో దర్భాసనాసీనుఁడై. 113.

ఉ. ఏగతి సాగరంబుఁ దరియించెను జానకి నెట్లు చూచెను నిం
కేగతి భూచరిష్ణు లగునిక్కపివీరులసేన లబ్ధిపైఁ
బోఁగల రంచు జింత మనమూఁ దథియింపఁ గుశాసనస్థుఁడై
రాగవుఁ డుండఁ గానఁబడెఁ గ్రిచ్చఱ జ్యోతి యొకండు దవ్వులన్.

చ. అభిముఖమై తదుజ్జ్వలమహ స్సరుదెంచుట గాంచి కీశరా
ట్ప్రభ నిలుచుండి ఫాలతటసంఘటితాంజలియై కనంగఁ ద
త్ప్రభయుఁ గ్రమక్రమంబుగను బంచజనాకృతిఁ దోఁచి తాపస
ప్రభుశుభరూపమై నయనపర్వ మొనర్చుచుఁ జేరవచ్చెడున్. 115.

క. పాపాపహాంత సౌమ్యుఁడు
లోపాముద్రాయుతుం డలోకద్యుతి వా
తాపిదమనుఁ డర్ణవనివ
హాపోశనపటు వగస్త్యుఁ డై కనఁబడియెన్. 116.

వ. రాముండు నక్కుంభసంభవసందర్శనంబున హృదయంబునం గల
ఖేద ముపశమిల్లి వల్లన సతీయుతుం డగునమ్మహర్షి కర్ఘ్యాదు లొ
సంగి తత్పదంబుల శిరంబు సేర్చి కొండొకతడ వట్లన యుండి ధృ
తిఁ బూని యుత్థితుఁడై యిట్లను. 117.

ఆ. జనకసముని నిన్నుఁ గనఁ గల్గుట శమించె
నెల్లదుఃఖ మబ్ధి యింకి నటుల
యే నవాప్తకాముఁ డైనాఁడ మాసూర్య
వంశ మొందె నేఁ డవార్యమహిమ. 118.

సీ. తొలుత రాజ్యపదచ్యుతుఁడనై సతీభ్రాతృ
సహిత మరణ్యవాసము నొనర్తు
నచట మారీచుమాయల నేను ద వ్వేఁగ

నవనిజ రావణుం డపహరించెఁ
గొనిపోయి యసుర సీత నశోకవని డాఁచె
నని మే న్దొఱఁగనున్న దనియు వింటెఁ
దనుచరాధిపునిమైత్ర్యము గాంచి తత్పైన
గొలువ రా నడ్డ మీజలధి దగిలె
గీ. దాఁటు టెటు? దీని రక్కసు గీటడంచు
టెట్లు? జానకిఁ దెచ్చుట యెః? ట్లటంచు
పాయ మెఱుఁగక యుండ నాపాలిదైవ
మనఁగ నీదర్శనం బబ్బె మునిలలామ! 115.

వ. అనుటయు నత్తాపసలలామం బిట్లనియె. 120.

చ. వగవకు వత్స! భానుశశివంశజు లైనమహాత్మ్ము లెందఱో
వగల మునుంగ రే వ్యసనవర్జితులై విలసిల్ల రొక్కొ! ము
జ్జగమున నీసహోదరునిసాటి ధనుర్ధరుఁ డుంట కల్ల, యి
య్యగచరనేత శాసటగ నబ్బె ననాథుఁడ నంట లెస్సయే. 121.

గీ. ఇంతటిసహాయసంపత్తి యిరవుకొనియె
నే నిదె హితోపదేష్టనై యేఁగుదెంతు
నింక నివ్వారిరాశి ని న్నేమి సేయు
స్వాంతమందుఁ గలంపు గోష్పదము గాఁగ. 122.

చ. కలికములోని కేని యుదకం బొకబొట్టును లేనియట్లు లీ
జలధి నొనర్తు, నీవుఁ గపిసైన్యము నేఁగఁగ వచ్చుఁ గాని యం
దులయశ మెల్ల నాదె యగుఁ, దోయధి నీ వెటు కట్టితేని య
య్యలఘుయశంబు నీది యగు యత్న మొనర్చి రచింపు సేతువుఁ-

మ. అరిఁ జెండాడి ధరిత్రిపుత్రిఁ గొని నీ వాచంద్రతారార్క మౌ
స్థిరకీర్తిన్ గను మంచు నగస్త్యముని యాశీర్వాదమున్ జేసి క
న్మొఱఁగన్ సేతువు గట్టి వార్ధికిఁ గపీంద్రుల్ సేనతోఁ గొల్వఁ జె
చ్చెర లంకాపురి సొచ్చి వ్రచ్చి రిపు, దెచ్చెన్ రాముఁ డాభూమిజన్.

వ అని యాక్షేత్రమహిమ వర్ణించి తత్తీర్థంబున నాభిక్షువు స్నానం బాచరించి రామనాథునకుఁ బ్రణామము లొనర్చి మనుజులకు శ్రద్ధ గలుగుటకై తద్వైభవం బంతయు శిష్యులకుం జెప్పుటయు నందొ క్కపండితుం డగుశిష్యుండు 'రామేశుఁ' డనునామ మేసమాస మ నుటయుఁ దత్పురుష కర్మధారయ బహువ్రీహిభేదంబుల ముత్తెఱం గగు. 125.

గీ. తత్పురుష మంచుఁ దొలి రఘూద్వహుఁడు నుడివె
నభవుఁ డనియె బహువ్రీహి యనుచు భక్తి
నమరు లది కర్మధారయం బనిరి సమస
నమ్ము వివరింప 'రామేశ' నామమునకు. 126.

చ. అనుచు సమాసమున్ దెలుప నచ్చటికోవిదలోక మెల్లఁ ద
ద్వనరుహాపాదుధీపటిమ భక్తి నుతింపఁగఁ గొంతకాల మం
దున వసియించి శిష్యసహితుం డయి తీర్థము లెల్ల నాడి య
య్యనఘుఁడు మాతులీయనిలయంబును జేరెను బర్యటించుచున్.

సీ. గృహదాహమును విని ఖిన్నుఁడై యాపద్మ
పాదుఁ డాగ్రంథావసాదనమున
కందిన యత్యార్తి కంటెను మాతులు
నిల్లుపోకకు దురటిల్లి మిగుల
'నను విశ్వసించి దాఁచిన గ్రంథదాహమ్ము
నకె కాని గృహనాశనమున కడల

ననెడుమాతులుని నూరార్చి నాబుద్ధిలోఁ
గలదు గ్రంథ మ్మని తెలిపి యప్డు

గీ. వ్యాఖ్య మరల రచింప నుపక్రమించు
టెఱిఁగి బుద్ధిఘ్న మగుద్రవ్య మిరవుకొల్పి
యోగిరము వెట్టి తినిపించె భాగినేయు
నప్పయోముఖవిషకుంభ మండ్రు జనులు. 128.

పద్మపాదాదిశంకరశిష్యు లొక్కటఁ గూడుకొని యాచార్యులం జేరుట

వ. ఆసమయంబునఁ దన్నుంబోలెఁ దీర్థయాత్రాపరు లగుసతీర్థ్యులు కని
ష్ఠాశ్రమస్థు లగుకొందఱ తావృత్త మెఱిఁగి యరుదెంచి కృతప్రణా
ములై యనేకదివసయోగజైక్యమునఁ బరస్పరప్రశంసల నొనర్చు
కొనిరి. 129.

మ. పటువాచావిజితాంగిరఃఫణిపతిప్రాచేతసుల్ తద్వశుల్
ఘటితాచార్యపదాబ్జచిత్తు లయి శంకల్ దక్కి యాపల్లవో
త్కటతర్క బ్బల్లవ మట్లు ద్రుంచి యసుహృత్తార్క్యాహితార్క్యాహితా
ర్భటి దీపింతురు; దేశికాంఘ్రి పురుషార్థం బెద్ది చేకూర్పదో. 130.

గీ. అంతఁ దచ్ఛంకరార్యశిష్యప్రతాన
మాలకించె స్వదేశకీయమును సుఖద
మైనయొకవార్త నఖిలతీర్థాటనంబు
సలిపి వచ్చినయొకవిప్రకులునివలన. 131.

చ. గురువరుఁ జూడఁ జాలమికిఁ గొందల మందెనుశిష్యబృంద మ
క్కరణి నెఱింగి పొంగి కనఁగాఁ జనఁగోరిరి కేరళాన; క
త్తఱిని గురుండు గూడఁ దనతల్లికి సంత్యవిధుల్ పొనర్చి ని
బ్బరముగ నాత్మధర్మపరిపాలనసక్తి విరక్తి రాజిలెన్. 132.

కేరళమున విష్వక్సే
చారుండై మానసమున ధాతుస్థిలరాక్
గోరి చని పొగడె దేశికుఁ
డీరీతి మహాసురాలయేశు నొకతఱిన్. 133.

పరిపూర్ణుఁడవు జగత్పతి నీవు దలచే
నపరిణామాజనవాంఛ నధిగమించి
సృజియింతువఁట చిదచిద్రూపముగ జగ
మపగతసపనసత్వ మైనప్రకృతిఁ
ద్రిగుణమ్ము లూని యీజగము పుట్టించి ర
క్షించి తుదింతువు త్రిమూర్త్యంచనమున
వివిధజలప్రతిబింబితరవియట్లు
విశ్వగతిన్ బహువిధముఁ గందు
వని యభిష్టుతు లొనరించు చావిశిష్టుఁ
డమరసద్మమ్మునం దుండుసవసరమున
సుచిరవిరహార్తు లైనశిష్యులు నమస్క
రించిరి తదంఘ్రి యుత్తంసవృత్తి మెఱయ. 134.

కుశలానుయోగపూర్వము
వశిచంద్రుఁడు శిష్యతతిఁ గృపం దీర్ప వ్యథా
కృశుఁ డజహద్గదగదికా
వశుఁడై కంపిలుచుఁ బద్మపాదుం డనియెన్. 135.

దేవా! శ్రీరంగేశ్వరు
సేవించి మిమున్ భజింపఁ జేరుచు నుండన్
దోవను మాతులుఁ డగపడి
స్వావసథము సేర్చెఁ బ్రశ్రియమ్మున నన్నున్. 136.

ఆ. అతఁడు భేదవాది యని యెఱిఁగియును బూ
ర్వాశ్రమీయవాసనానుబంధ
వశత యుష్మదీయభాష్యటీకఁ బఱిచి
తీర్చితిని గృతానుయోగు మాను. 187

గీ. దగ్ధముద్రాస్యముద్రమంత్రమ్ము లగుచు
ధ్వస్తగురుతర్కకపిలతంత్రమ్ము లగుచు
నిగమసారామృతముఁ జిల్కునీదుసూక్తు
లనెడు వర్మము దాల్చి మానను జయింతు. 138

సీ. కాణాదసేనాముఖమున ఖడ్గాఖడ్గి
విహరణంబున నింత వెతను గనునె.
పశ్యత్పదానీకపటలిశస్త్రాశస్త్రి
రణరంగమునయందు శ్రమ మొనయునె
కాపిలబలముతోఁ గడఁగి యష్టీయష్టి
యొనరింప నాయాస మొందునొక్కొ
జైనబౌద్ధాదిపాషండులతోఁ గదా
గది యాజి నస దైనఁ గందునొక్కొ
గీ. ధీర!యాక్తికవంశమాక్తికమయమ్ము
లైనభవదీయసూక్తిసంతానములను
వ్యూఢకంకటుఁ డైనయేబుధుఁడు గాని
యఖిలజగములఁ గాలత్రయంబునందు.

వ. అది యట్లుండె నవధరింపుము. 140
సీ. అతఁడు గూఢోత్కుఁడై యభినందన మొనర్చి
నన్ను నావ్యాఖ్యను, మున్నువోలె
నమ్మి మామకము గ్రంథమ్ము దగ్గృహమందు

విన్యస్త మొనరించి వెడలినాఁడ
నర్ధరాత్రిము స్వగేహముఁ గాల్చి మామ మ
త్కృతకృతి భస్మసాత్కృతము గాఁగ
బుద్ధిహీనికి భైక్షమునఁ బెట్టె గరళమ్ముఁ
గృపణుఁడై యని పుట్టెఁ గివదంతి

గీ. యేది యెటు లైన దుర్విధి నాదునుది య
సంశయ మ్మాచుఁ బూర్వప్రిసాద మెనయ
దామె భవదీయసేవాపరాయణులకు
నిట్టి విషమోగ్రిదశ యుక్తమే మహాత్మ! 141.

ఆ. అట్టు లగ్ని గొనినయాటీక నెల్లని
మరలఁ గూర్పఁ బోవ మందమతిని
యుక్తిపాటవంబు స్ఫూర్తి మున్నట్లు
కలుగ దామె నెంత గాసిపడిన. 142.

చ. పరమదయాస్పదం బగుభవత్పదముల్ శరణొందునట్టియం
దఱు నతిదీను లైనఁ బరితప్తుల యైనను గందు రమ్మహే
శ్వరుపద మార్య! త్వచ్చరణభక్తుఁడ నాకపరాధ మున్నె? యే
దురితము మాపదార్ణవముతోఁ జెడు సంద్రిది సేయు సార్థముల్.

చ. అని వచియించు పద్మపదు నాగురుపాదులు వల్కి రుత్తమా
ర్ధనిబిడతన్ దయారసకరంభితచిత్తసరోజు లౌచు సాం
త్వనవచనంబులన్ శ్రవణతత్పరచిత్తతమోపహారకం
బు నమృతసాగరోపమితముల్ బుత మాఘనితిన్ స్మితాస్యులై.

క. విషమము కర్మవిపాకము
విషమోహాసమం బవార్యవిక్రిమ మనుచుసీ

విషయము సురేశ్వరునితో
మృష గా దెవు డనుచుఁ బల్కనే యానాఁడే. 145.

ఆ ఒనర వార్తికమున కుత్సాహిఁడై యుండు
నతని కీరుగూర్చునలపరాభ
వాగ్నిసుమి త్వదీయ మగుగ్రంథమును గాల్చెఁ
గాదు మేనమామ, గాదు వహ్ని. 146.

క. ఇతరులమన ముస్నరు మను
గతి నిర్హేతుకము మసలఁ గా, దయ్యావసూ
నితుచిత్తక్షోభము సం
తత మేర్చుక్ భస్మపిహితదవానోపమమై. 147.

క. ఎంతవిరాగము గల్గిన
నెంత తప మొనర్చినను మఱెంతగ శాంతిక్
దాంతి గడించిన నేని ర
వంతయనూయకును లోఁగ నఖిలము ఖిలమా. 148

వ. అది యట్లుండ నిమ్ము మున్ను శృంగరిక్షేత్రంబున నామూలాగ్ర
ముగాఁ బంచపాది వినిపించితివిగదా; దాని నేను మఱువలేదు ఖేద
మ్మడిగి క్రమ్మఱ లిఖించుకొమ్మని యాఱడిల్లఁ బలికె నప్పుడ.

కాలిపోయిన పంచపాదిగ్రంథమును శంకరులు ధారణాబలమున జెప్పుట.

ఉ. చెప్పెను బద్మపాదుఁడు రచించినతొల్లిటియానుపూర్వితో
నొప్పఁగఁ బంచపాది కృతి నొయ్యన నయ్యతి-సర్వవిద్యలక్
గుప్పి జగత్త్రయంబును గళుప్పలఁ గప్పెసుజ్ఞానశక్తిచే
నొప్పెడు దేశికాఖ్యపురుషోత్తముఁ డట్టుల సెప్ప టబ్రమే? 150.

గీ పద్మపాదుండు రభస ముప్పంచపాది
వ్రాసికొని పరమానందభరితుఁ డగుచు

లేచు గూర్చుండు విలపించు నాచికొనును
బరవశుం డయి యెలుఁగెత్తి పాడు నాడు 151.

వ. అంత. 152.

శంకరుఁడు కేరళరాజునకు నాటకత్రయము జెప్పుట.

మ. కవితాప్రౌఢుఁడు రాజశేఖరసమాఖ్యాకుండు తత్కేరళో
ర్వీవిభుం డాయతిచిత్రవార్త వినుచుణ్ విచ్చేసి కోటీరర
త్నవిఘృష్టాంఘ్రిపయోరుహుణ్ సలుపఁదత్కర్మందియానందమొం
ది విభుణ్ దత్కృతనాటకత్రయమువ్యాప్తింగూర్చిప్రశ్నించుచుణ్.

క. మొగ మింత సేసికొని య
జ్జగతీవరుఁ డనియెఁ బద్మచరణరచితకో
శగతినె నానాటకములు
దగులంబడె వీతిహోత్రధాటికి లోనై. 154.

క. అన విని శంకరసంయమి
మును వినుటను నాటకములు మూఁడింటేఁ బఠిం
చిన లిఖియించుకొనియెఁ ద
జ్జనపతి విస్మయతరంగితస్వాంతుండై. 155.

ఉ. స్పష్టముగా లిఖించుకొని పార్థివచంద్రుఁడు పొంగుచుణ్ మనో
భీష్ట మెదేని యున్న వచియింపు మొనర్చెద నంచుఁ బల్కె ని
ర్దిష్టభవానుబంధుఁడు యతీంద్రుఁడు వల్కెను వైదికక్రియా
భ్రష్టులు గాఁగఁ గాలటినివాసుల కిచ్చితి నేఁడు శాపముణ్. 156.

క. నాయిచ్చినశాపము భూ
నాయక పాలింపు మీ వనారతమును వై
ధేయులు వారలు నీకు వి
ధేయులు సుమి యనుచుఁ బలికె దేశికుఁ డంతణ్. 157.

గీ. పద్మపాదుఁడు నష్ట మౌపంచపాది
నెనసి సంతుష్టిఁ గనఁ గేరళేశ్వరుండు
నాటకత్రియ మొంది ప్రీణంతి యగుచు
గురుపదధ్యానరతుఁ డౌచు నరిగెఁ బురికి. 158.

—: శంకరుఁడు జైత్రయాత్రకు వెడలుట:—

ఉ. చెంతలఁ జేరి కొల్చుచు స్వశిష్యసహస్రములుం సుధన్వభూ
కాంతుఁడు వచ్చుచుండ నధికం బగుసర్వదిశాజిగీష నా
దాంతుఁడు శంకరుండు దొలుతన్ జని సేతువు దాఁకఁ బోవ మా
ర్గాంతర వర్తమాన కుసుతాంతరవర్తి జవార్తికంబుగన్. 159.

వ అట్లు పద్మపాదహస్తామలకసమిత్పాణిచిద్విలాస జ్ఞానకందవిష్ణుగుప్త
శుద్ధకీర్తి భానుమరీచి కృష్ణదర్శన బుద్ధివృద్ధి విరించిపాద శుద్ధానం
తానందగిరి ప్రముఖసహస్రశిష్యులతోఁ గూడి శంకరుండు చనుచు
మధ్యేమార్గంబుమధ్యార్జునంబనుశివావిర్భూతక్షేత్రరత్నంబుసొచ్చి

గీ. వనజగర్భాదిపూజితాంఘ్రిని నదృష్ట
చరుని మధ్యార్జునాహ్వయపరమశివుని
బుద్ధి నుపచారములఁ గొల్చి పొడవుమీఱు
పాపముల వీడ్కొని ఫలైకపాత్రమయ్యె. 161.

వ. అట్లు కొలిచి యాభగవత్పాదులు మధ్యార్జునక్షేత్రాలంకార
మగుమహాదేవు నుద్దేశించి యి ట్లనియె. 162.

క. నీవే యుపనిషదర్థము
నీవే సర్వజ్ఞుఁ డగుట నిగమాభిమతం
బై వరలున ద్వైతమొ
దేవా! ద్వైతమ్మొ తెలిపి ప్రోవుము శంకర్. 163.

మ. అన మధ్యార్జునలింగమౌళి నొకదివ్యజ్యోతి తోఁతెంచి బో
రన "యద్వైతమె సత్య" మంచును ద్రివారం బార్చి మాయంబుగా
గను, దద్ద్రష్టలు నద్భుతంపడి యశంకన్ శంకరాచార్యపా
వనపాదాశ్రయులై గ్రహించి రపు డద్వైతాధ్వమున్ భక్తిమై. 164

వ. మఱియుఁ బ్రాతఃస్నానాదివిశుద్ధులై యాదిత్యాంబికావిష్ణుగణనాథ
మహేశ్వరాత్మకపంచాయతనపూజాతత్పరులుం, బంచయజ్ఞపరా
యణులు శ్రౌత్యాచారరతులు శుద్ధాద్వైతబద్ధబుద్ధులు నగుట
యు వారల వీడ్కొని శంకరుఁడు సశిష్యంబుగ రామేశ్వరంబు
సేరుటయు నచ్చట. 165.

—: శంకరులకు శాక్తులతో వాదము :—

క. జరిగె గిరిజార్చనాచ్ఛల
పరిపీతాసవము శాక్తపటలముతో శం
కరులకు మతవాదము పరి
సరజనదత్తానుమోదసద్యుక్తికమై. 166.

వ. అది యెట్లన:—నాశక్త్యుపాసకు లెల్ల యతిశేఖరునకు మ్రొక్కి—
"స్వామీ మామతంబు పావనం బవధరింము. శంభుగుణముల కవ్వ
లిదియు, నశేషకార్యజననియు, నాద్యయు నగుశక్తిచే మహదాది
సకలజగం బుత్పన్న మగు. 167.

గీ. అల్లపరశక్తి వాఙ్మనసానవాప్య
యగుట సేవింపరామిఁ దదంశ మగుభ
వానిపాదాంబురుహము లన్వహము పూజ
సలుపుచుండుదు మార్య! నిష్కలుషభక్తి. 168.

క. శ్రీవిద్యోపాసకులకు
జీవన్ముక్తిని ఘటించు శ్రీశక్త్యంఘ్రుల్

గాత్రునఁ దాల్తుము బుజముల
శ్రీవాస్థలి వాని స్వర్ణకృతచిహ్నములన్. 169.

గీ. విద్యను నవిద్య నెఱుఁగు నేవేత్త;యతఁ డ
విద్యఁ గొని మృత్యువు జయించి విద్యచేత
నమృత మెనయును గాన విద్యాస్వరూప
యుంబయ ముముక్షువుల కవలంబ మగును. 170.

గీ. ఈశరూపిణి ప్రకృతి యాః;యీశ్వరప్ర
కృతులకు నభేదకలనము శ్రుతికథితము
కన 'సదైవ'మాదివాక్యములు తత్ప
రమ్ము లౌట నవ్వియె ప్రమాణమ్ము లిందు. 171.

సీ. ప్రణవస్థ మగునకారప్రభృతుల కట్ల
శాంభవీప్రముఖతచ్ఛక్తులకు స
ముత్పత్తి గలుగుచునుండు; సమస్తదే
వతకారణం బగుప్రభునకుఁ బర
మైన చంద్రునకు జ్యోత్స్నయటుల రుద్రోద్బోధ
కస్వరూపిణి యాచుఁ గ్రాలుచుండు
స్వాధీనవల్లభ యనఁబడురుద్రశ
క్తి భవాని యని నమ్మితిమి త్రిశుద్ధి
గీ. పురుషోత్తమ!తచ్చిహ్నధారి వగుచు
నావిముక్తిద నాజగదంబ నీశ్వ
రినె యుపాసింపవలయు నీ వనుచుఁ బలుక
వారితో నిట్టు లాచార్యవర్యుఁ డనియె. 172.

క. వరఁగ నిది సత్య మైనను
'బురుషోత్తమబోధముననె ముక్తి' యని శ్రుతో

త్కర మనుట; నాత్మ నాత్మను
బొరసిననే కలుగు ముక్తి, పాడము దిఁ గొంటన్.  173.

క. ఇందులఁ బ్రమాణ మగుఁ 'దమేవైవ'మాది
వాక్యతతి, యజామిత్యాది వాక్య మయ్యా
జాస్వరూపమ్ము దెల్పి, మోక్షమ్ము వడయు
కొఱకని పరేశతత్త్వమే యెఱుక పఱిచె  174.

మఱియును సాంఖ్యులు ప్రకృతిని
నెఱిఁగి, వికృతిదూరుఁ బరుని నెఱుఁగుటనే చె
ప్పిరి ముక్తిగఁ గాన సుఖా
కరు నీశ్వరు నెఱుఁగ ముక్తి గలుగును జూరే.  175.

బ్రహ్మేత్యాదికనిగమము
బ్రహ్మముతో జ్ఞాని కైక్యభావము నొడివెన్
'బ్రహ్మైవ' యనుచుఁ గావున
బ్రహ్మజ్ఞానమ్ము మీరు పడయఁగవలయున్.  176.

ఏయుమ భవాని యని వచియింపఁబడియె
నామె యద్వైతబోధినిద్యాస్వరూప
విడువ కమ్మహాదేవి సేవించుచుండ
శీఘ్రముగఁ గైవసం బగుఁ జిత్తశుద్ధి.  177.

కావున మీరు కుంకుమపుండ్రాంకమును హైమపాదాదిచిహ్నము
లను విసర్జించి 'బ్రహ్మహా'మ్మనెడువిద్యయందు నాసక్తులరు గం
డనుటయు  178.

వారు చిహ్నములను వడి వీడి శంకరు
గురునిగాఁ దలంచికొనుచు స్నాన

గావునఁ దాల్తుము బుజముల
శ్రీవాస్థలి వాని స్వర్ణకృతచిహ్నములన్. 169.

గీ. విద్యను నవిద్య నెఱుఁగు నేవేత్త;యతఁ డ
విద్యఁ గొని మృత్యువు జయించి విద్యచేత
నమృత మెనయును గాన విద్యాస్వరూప
యంబయ ముముక్షువుల కవలంబ మగును. 170.

గీ. ఈశరూపిణి ప్రకృతి యా;యీశ్వరప్ర
కృతులకు నభేదకలనము శ్రుతికథిత మ
కన 'సదైవ'మాదివాక్యములు తత్ప
రమ్ము లౌట నవ్విధమె ప్రమాణమ్ము లిందు. 171.

సీ. పరిణవస్థ మగునకారప్రభృతుల కట్ల
శాంభవీప్రముఖతచ్ఛక్తులకు స
ముత్పత్తి గలుగుచునుండు; సమస్తదై
వతకారణం బగుప్రభునకుఁ బర
మై చంద్రునకు జ్యోత్స్నయటుల రుద్రోద్బోధ
కస్వరూపిణి యాచుఁ గ్రాలుచుండు
స్వాధీనవల్లభ యనఁబడురుద్రశ
క్తి భవాని యని నమ్మితిమి త్రిశుద్ధి
గీ. పురుషోత్తమ!తచ్చిహ్నధారి వగుచు
నావిముక్తిద నాజగదంబ నీశ్వ
రినె యుపాసింపవలయు నీ వనుచుఁ బలుక
వారితో సిట్టు లాచార్యవర్యుఁ డనియె. 172.

క. వరఁగ నిది సత్య మైనను
'బురుషోత్తముబోధముననె ముక్తి' యుని శ్రుత్యో

త్కార మనుట; నాత్మ నాత్మను
బొరసిననే కలుగు ముక్తి, పొడమ దిఁ కొంటిర్. 173.

గీ. ఇందులఁ బ్రమాణ మగుఁ 'దమేవైవ'మాది
వాక్యతతి, యజామిత్యాది వాక్య మయ్యు
జాస్వరూపమ్ము దెల్పి, మోక్షమ్ము వడయు
కొఱ కని పరేశతత్త్వమే యెఱుక పఱిచె 174.

క. మఱియును సాంఖ్యులు ప్రకృతిని
నెఱిఁగి, వికృతిదూరుఁ బరుని నెఱుఁగుటనే చె
ప్పిరి ముక్తిగఁ గాన సుఖా
కరు నీశ్వరు నెఱుఁగ ముక్తి గలుగును జూడే. 175.

క. బ్రహ్మేత్యాదికనిగమము
బ్రహ్మముతో జ్ఞాని కైక్యభావము నొడివెన్
'బ్రహ్మైవ' యనుచుఁ గావున
బ్రహ్మజ్ఞానమ్ము మీరు పడయఁగవలయున్. 176.

గీ. ఏయమ భవాని యని వచియింపఁబడియె
నామె యద్వైతబోధినిద్యాస్వరూప
విడువ కమ్మహాదేవి సేవించుచుండ
శీఘ్రముగఁ గైవసం బగుఁ జిత్తశుద్ధి. 177.

వ. కావున మీరు కుంకుమపుండ్రాంకమును హైమపాదాదిచిహ్నము
లను విసర్జించి 'బ్రహ్మహ'మ్మనెడువిద్యయందు నాసక్తులరు గం
డనుటయు 178.

ఆ. వారు చిహ్నములను వడి వీడి శంకరు
గురునిగాఁ దలంచికొనుచు స్నాన

సంధ్యలందుఁ గనిరి శ్రద్ధ శుద్ధాద్వైతు
లగుచుఁ బంచపూజనాదిసక్తి. 179.

లక్ష్మీభక్తులతో వాదము.

ఆ. అంత నటకు శ్రీమహాలక్ష్మిభక్తులు
వచ్చి గురున కెఱఁగి పలికి రిట్లు
వినుము దేవ! శాస్త్రవిహితంబు యుక్తిస
హంబు నైనమామతంబురీతి. 180.

సీ. బ్రహ్మాండజనని సర్వఫలప్రదాత్రి మ
హాలక్ష్మియే యాద్య యైనప్రకృతి
యగు 'సస'దిత్యాదినిగమోక్తి; నిఁక 'సదే'
వేతి వేదోక్తి విధాతృముఖ్యు
లమల మహాపురుషోత్తమాంగమ్మునుండి యే
యింతియందు జనింతొ, రెవ తెయంద
పరమేశునకుఁగూడఁ బరఁగునంత ర్భావ
మా దేవి సేవ్య మోక్షార్థులకును
గీ. కుంకుమాంకితమహాళు లబ్జాంకలసిత
భుజులు పద్మాక్షమాలావిభూషు లగుచ
మానసారాధనాసక్తమతులకుఁ గర
గతమ యగు ముక్తి, కాన మామతము గొనుము 181.

వ. అనుటయు శంకరుం డాశ్రీభక్తులతో దత్త్వంబు దెలిపెద వినుం
డని యి ట్లను. 182.

సీ. సదసత్స్వరూపుఁడై జానొందు నద్వితీ
యుఁడు పరమాత్మ యొక్కఁడ జగంబు

సృజియించువాఁడు గా కిలరుండు లేఁడు 'స
　　ఆత్మ 'యను శ్రుతిచేత వ్యాహృతుఁ డగు
నానందరూపుఁడై యలరు సదా తద
　　ధీన యాప్రకృతి కెందేని మోచ
కత్వమ్ము చెల్లునే? కడఁక నెవ్వండు "బ్ర
　　హ్మహ"మ్మను ధ్యాన మాచరించు
గీ. వానికి విముక్తి కరగతం బౌ ననిత్య
దేవతోపాసకులకుఁ దద్విధజగము లె
తాఱుఁ గానఁ గుంకుమపద్మధారణంబు
విడిచి కైకొనుఁ డద్వైతవిద్య ముక్తి. 183.

క. అని శంకరుఁ డుపదేశిం
చిన వా రద్వైత మూఁది శిష్యత్వము గాం
చిన యావృత్తాంతము విం
చును జేరఁగ వచ్చి రాశుశుష్ణీకల్పుల్. 184.

శారదోపాసకులతో వాదము.

ఉ. భాసురపుస్తపుండ్రకవిభావరిచిహ్నితు లౌచు శారదో
పాసకు లయ్యతీంద్రునకు వందనముల్ పచరించి,నిత్యతన్
భాసిలు వేద;మట్లగుట భారతి నిత్యయు లోకహేతువున్
హ్రాసవిదూరరూపయుఁ బరాత్పరమూర్తియునై విరాజిలున్. 185.

గీ. ఆమెయే బ్రహ్మ హరి హ రాద్యఖిలశబ్ద
గమ్య, యాదేవియే జగత్కర్త్రి నిత్య
యనె శ్రుతి, ముముక్షువులకు నుపాస్య యగుట
నాగుణాతీత నీకు నుపాస్య యగుత. 186.

గీ. పర మయిన వాక్స్వరూపంబు నెఱుఁగఁ డింత
శ్రుతిగ తార్థానభిజ్ఞుఁ డంచును వచింపఁ
గాదె 'నావేద'యనుసూక్తి? గని తదర్థ
మానఁ దగు వాక్స్వరూపసంధాన మవుల* 187.

చ. అనుటయుఁ "గంఠ తాలు రదనాదిక సంగతిఁ బుట్టువేద మే
యనువున నిత్య మా"ననియు నయ్యతి యి ట్లను-వర్ణమాత్రమా
కన ధ్రువ మైన?దతఁ రనికాయమ?యాదిమ మెప్పు గాదు గ్ర
న్నన నవియుఁ జగల్లయమునఁ లయ మొందు ధ్రువంబులెట్టులౌ?

క. అమరు శ్రుతు 'లీశునిశ్వసి
తము లై' యనుసూక్తి జన్యధర్మమ్ములవ; జ
న్యము లెల్ల ననిత్యము లను
ప్రమాణమునఁ గాదు నుఁడి ధ్రువం బంతిమముఁ. 189.

సీ. అంగసమన్వితం బగు వేదము యుగాంత
మున లయం బొందును, మునులకు రవి
సెప్పె నంచును సూర్యసిద్ధాంతమున నుండెఁ
బ్రళయ మొందిన వేదరాశి కర్తు
వలనఁ బ్రవర్తనం బలవడుటను శార
దకు నెట్లు గల్గు సత్యత్వ మకట!
సుర లనిత్యుల మైనఁ బరమేష్ఠి ధ్రువుఁ డౌట
నిత్యయే వాణి యండ్రేని వినుఁడి

*క. వేదార్థవివేకరహితుఁ
డే దెసబర వాక్స్వరూప మెఱుఁగఁడ యని "నా
వేదేత్యాద్యుక్తి"లిమి
వేద మెఱిఁగి వాక్స్వరూపవిదుఁ డౌట తగుఁ.

గీ. యాదిమప్రాణి యాట నిత్యత్వశూన్యుఁ
డగుచతుర్ముఖముఖముల నలరుశారద
దకు ననిత్యత్వ మర్థసిద్ధమ్ము కాన
శ్రీమ మదేల వాఙ్నిత్యతాసాధనమున. 190.

వ. పరమాత్మాతిరిక్తంబునకు మృషాత్వంబు సిద్ధంబ కానఁ బరమయుఁ బ్రకృతియు నగుశారదయె మహదాదివిశ్వంబునకుఁ గారణం బగుట యసంగతము. వాగాద్యతీతం బగునప్పరమభూమం బొక్కటియ సదాదిశబ్దబోధనీయము కాని ప్రకృతి కాదని యెఱింగి సదాదిశబ్దంబుల బ్రహ్మజ్ఞానము సాధనీయంబు, ముక్తిపదంబు నొంద నాత్మజ్ఞానముదక్క నన్య మగునుపాయంబు లేదని వేదము పలుకుట లేదే? అట్లుగాన శుద్ధాద్వైతబద్ధబుద్ధులరై మీరు స్నానాదిసకలకర్మమ్ము లీశ్వరార్పణబుద్ధి సలిపి దురితములఁ దొఱఁగి శుద్ధులై యానందఘన మ్మగుబ్రహ్మము నెఱింగిననే ముక్తు లగుదురు కాని యన్యథా కానేర రనుటయు నాశారదోపాసకు లెల్లను శంకరార్యశిష్యులైరి. యంత వామాచారు లగుశాక్తులు కొందఱు జగద్గురుఁ గాంచి యి ట్లనిరి. 191.

—: వామాచార శాక్తులతో వాదము :—

మ. వెడ వేసమ్ము ధరింతు, వారయవు సంవిదాప్రమున్ మూఢుౖవై
వడి, వంద్యాత్మనయోఽవమం బైనయద్వైతప్రబోధంబునన్
బడె, దద్వైతమె సున్న, భేదము లయావస్థాప్తినే నుంట—మా
నుడు లాలించి గ్రహించి శక్తిమతమున్, మోక్షమ్ము చేకోఁగదే.

సీ. పృథగాకృతిని నెద్ది యీశునందు విమర్శ
మనుసంజ్ఞతో వెల్గు ననవరతము
నెయ్యది లేక షరేశుఁడు నల్పకి

చ. ఇటు పటుయుక్తిసూక్తుల యతీంద్రుఁడు దక్షిణ వలగొంచు నీచవా
క్ఛటల నెదిర్చువారి ద్విజజాతిబహిష్కృతు లౌననార్యులన్
బటుమతు లైనశాక్తుల క్షణంబునఁ దత్ప్రతివాక్యలాపనా
పటువులఁ జేసి లోకహితవాంఛ రచించెను గర్మసేతువున్. 202.

—: శంకరుఁడు రామేశ్వరమున కరుగుట :—

మ. క్రమ మొప్పం గనుఁగొంచుఁ బూర్వరరమున్ రామేశ్వరక్షేత్రసీ
మము నెల్లన్ వడిగొంచు వచ్చి కనెఁ దన్మధ్యస్థసౌవర్ణహ
ర్మ్యమునన్ రాఘవసంప్రతిష్ఠితుని సవ్యార్ధాంగమాతాగ్రహ
స్థు మహానీలలసత్కిరీటు జగదీశున్ రామనాథేశ్వరున్. 203.

సీ. సేతుపరిష్కృతసింధూర్మికల రామ
నాథార్పణముగ స్నానం బొనర్చి
నభిషేక మొనరించె నమలంగంగాంబులఁ
బొంగి తత్సైకతలింగమునకు
నారగ్వధాబ్జదుత్తూరప్రసవ బిల్వ
పత్రరాసులతో సపర్య నడసె
నానాఫలమ్ముల నైవేద్య మర్పించెఁ
గమ్మని కవిత స్తోత్రమ్ము సేసె
గీ. శంకరాచార్యుఁ డిటు నిజచ్ఛాత్రసమితిఁ
గూడుకొని బ్రహ్మభావన షోడశోప
చారముల రామనాథు హార్దమునఁ దేల్చె
రెండుమూనము లచటనే యుండఁ దలఁచె. 240.

వ. అంత నాక్షేత్రవాసులును, దత్పరిసరజనపదనివాసులు నగువ్రజ
లును శంకరాగమనంబు విని దర్శింప గుములు గట్టి నిరంతరం బరు
దెంచి తదోబ్ధమునఁ దనియుచుండుదు రట్టియెడ. 205.

సీ. అద్వైతదూషకు లంచితలింగాంక
బాహుయుగ్మకులు శైవవ్రజంబు
శూలాంకచిహ్నితఫాలస్థలులు లింగ
ముద్రితాఖిలతనుల్ రుద్రభక్తు
లురుడమరుకాంకబాహులు లింగధరులు మ
స్తకధృతశూలురు జంగమాళి
శూలాంకలక్షితఫాలవక్షోనాభి
బాహావిరాజితుల్ పాశుపతులు
గీ. గుములు గుములుగ వచ్చి యగ్గురులలామఁ
గాంచి ప్రణమిల్లి యీరీతిగా వచించి
రఖిలమతముల సత్తంప మని యొకొక్క
రాత్మమతగతవివిధసిద్ధాంతములను. 206.

వ. అందుఁ బాశుపతు లిట్లనిరి; 207.

క. కారణ మీశ్వరుఁ డగుటస
దారాధ్యుఁడు చిహ్నధారు లగువారి కప
ర్గారమణుఁడె యను నిగమస
మీరితములె మానములు సుమీ మతమునకున్. 208.

గీ. ఋతము సత్యమ్ము పరము నై యొసఁగు బ్రహ్మ
మనఁగ, నూర్ధ్వరేతుఁడు విరూపాక్షుఁ డైన
కృష్ణపింగళపురుషుఁగా నెంచ యుట్టి
విశ్వరూపున కర్పించువినతి యుద్ది 209.

సీ. ఏదేవునకు దివం బెసలారు శిరసుగా
నభ మొప్పు నెవనికి నాభి గాఁగ
భాస్కరుఁ డిందుఁ డెవ్వని కగుఁ గనులు గా

నెవని కాది కర్త శ్రవణములుగ
మఱి విస్పత్తంబు లామ్నాయంబు లెవనికి
వెలయు వాక్కు గ నంచు వేదకథితుఁ
డగునట్టి వానిమోక్షార్థినై శరణంబు
వేఁడెద నను వాక్యవిధముఁ బట్టి

గీ. శివుని యెడ భక్తి గల్గి తచ్చిహ్నచిహ్ని
తాత్ము లగుభక్తజనముల కనవరతము
నభవలోకనివాస రూపామృతంబు
హస్తగత మౌఁ జుమీ యనాయాసముగను. 210

వ. ఇంతియ కాదు! జగత్కారణం బెద్ది యని యొకప్పుడు దేవతలు ధ్యానించుచుండ నంబరంబున నంబరాంబరుండు దివ్యదర్శన మొసంగి నీ వెవ్వఁడ" వని యడుగు నిర్జరుల కిట్లను. వేల్పులార! తొలుదొల్త నే నొక్కండ నుంటి నాకంటె నన్యుండు లేఁడ నేఁడు జగదీశ్వరుండ నగుట సర్వయుండనై నేన యుందు" ననియెఁ గావున నుపాదానకారణం బగుటం జేసి ప్రభు వగుశివుండ సద్బ్రహ్మాత్మాదికము లగుసామాన్యశబ్దములకు వాచ్యుం డయి జగత్కర్త యగు.

ఆ. లేఁడు తొల్లి బ్రహ్మ లేఁడు శంకరుఁ డొక్క
వాసుదేవుఁ డున్నవాఁ" డను నెడ
నగును వాసుదేవుఁ డన మహాదేవుండె
విను తదర్థ మింత విస్తరింతు. 212.

వ. తనయందు జగము లన్నియు వసించుటను వాసు వనంబడు, నట్టిదేవుండ వాసుదేవుం, డతండ జగత్కర్త యగుమహేశ్వరుండు. శ మ్మన సుఖంబు,దానిం గలిగించువాఁ డగుటం జేసి శంకరుం డనం బరఁగు నట్టిచో విష్ణుండు పాలకుం డనుట యెట్లు పొసంగును? ప్రకృతిప్రళయంబునఁ బాల్యం బగుజగం బెల్ల నభావంబుం

పొందఁ బాలకుం డగువిష్ణువును లేకుండుట ధ్రువంబు 'రుద్రులలో శంకరుఁ డను నేన' యనిన కృష్ణోక్తియే శంకరుండు పరమాత్మ యనుటకుఁ బ్రమాణము. మఱియు దుర్వాసునకు మహాదేవుండు సెప్పిన కొన్ని వాక్యంబులు గలవు సావధానంబుగ వినఁగదనవి 213

సీ. అరయ నే నొకఁడ నక్షరుఁడఁ గర్తఁ బరాత్ప
రుఁడ శివుండను సదాత్ముఁడను జువ్వొ
యజ విష్ణువులకు లోకావళి కాదికా
రణ మైనవాఁడఁ బురాణవస్తు
వను బూర్వగుఁడను బూర్వజ్యేష్ఠుఁడను శ్రేష్ఠుఁ
డను నద్వితీయుండ ననఁ దనర్తు
నస్మదిచ్ఛారూప యగుశక్తి లోకసం
హారమ్ము సేసి నాయం దణంగు

గీ. సృష్టిసేయుదు నేఁ బున స్సృష్టి దాని,
నది ప్రకృతియై గుణత్రితయాంకురప్ర
ధానకారణ మగు మహత్తత్త్వమును సృ
జించె మత్సాత్త్వికము స్వతంత్రించి యంత. 214.

మ. కలిగించెన్ ద్రిగుణాత్మకం బగునహంకారమ్ము, దానన్ గుణా
త్ములు రుద్రుల్ పదునొక్కరున్ బొడమ, నందున్ సృష్టికై రాజసా
త్ముల, రక్షార్థము సాత్త్వికాత్ముల, లయంబున్ జేయఁగాఁ దామసా
త్ములఁ గావించె యథాప్రకారముగఁ బెంపుంగాంచు నట్లాదృతిన్

క. ఆవిర్భవించిరి యువ
* ర్ణోవర్ణ మవర్ణములఁ బయోజాసనల
క్ష్మీవర శివు లనఁ గ్రమముగ
మూవురు సకలమ్మునందు ముఖ్యులయి తొలిన్. 216.

---

క. 'అ'నుండి పొడమె ద్రుహిణుం,
* 'ఉ'నుండి జనించి విష్ణుఁ డుదితుఁడై 'మ'వ
ర్ణాన మహేశుఁడు, సకలము
లోన ప్రముఖభావమున వెలుంగుదు రెలమిన్. పాఠాంతరము.

ఆ. వారి ననుసరించి వర్తింతు రితరు లే
కాదశేశు లిట్టి క్రమమువారు
తద్విభూతు లీపృథక్పృథగాఖ్య మా
నమరతితి చరాచరము జగములు

క. నానాత్వము తత్తత్క
ర్మానుస్మృతిని జెందినట్టి యఖిలమును లయం
బౌ నలబ్రహ్మజ్యోతి, న
నూన ప్రలయావసర మహోగ్రావస్థన్.

సీ. అఖిలంబు లోఁగొని యరుణ మహారాజస
తేజంబు మలయ వర్తించు బ్రహ్మ
శ్యామలం బైన నారాయణ తేజంబు
నందు నస్తంగతుం డైనయంత
నంతర్భవించు నారాయణుండును శుక్ల
దీధితి యగురుద్ర తేజమందు
నారుద్రుఁడు స్వకీయ మగుశుక్ల తేజంబు
తోఁ బ్రకృత్యంతర్గతుఁడుగ నౌను

గీ. బ్రకృతినామయు శుక్లవర్ణయు నగు మ
దిచ్ఛ నాయందె డిందుఁ జుమ్మీ యు పాట
నను ననంతు సర్వజ్ఞు లౌజనులును గన
లేరు; నామాయఁ దెలియఁగా లేఁ డెవండు.

సీ. కాన శ్రీరుద్రసూక్తజపాశ్రితులు రుద్ర
భవ్యపూజాదితాత్పర్యమతులు
పంచాక్షరీమనూపాసకుల్ భసితలి
ప్తాంగులు రుద్రాక్షహారధారు

లవిరతధ్యానపరాయణులును నౌచు
నవ్యక్తు వ్యక్తాత్ము నభవు రుద్రుఁ
బూజింతు రేనరపుంగవుల్ వారికి
నిశ్శ్రేయసమ్ము ప్రాణిష్ఠ మగుట

గీ. భూతిరుద్రాక్షధారణంబును బొనర్చి
యమల మగు భక్తిరీతిఁ జిత్తమును గూర్చి
శ్రీమహాదేవు సర్వాణిశ్రీఁ దనర్చు
ద్వంద్వముక్తుండవై భవవ్యథ విదిర్చు. 220.

క. అని యభవుఁడు దుర్వాసో
మునికిఁ దెలిపి మాయమయ్యె మునియుఁ దదాచా
రనిరతుఁ డయ్యెను గావున
జనులు ముముక్షులు పరాత్ము శంభు భజింపరే. 221.

గీ. ధృతిని నారాయణుం డద్వితీయుఁ డగుచుఁ
బ్రజల సృజియింపఁ దలఁచునప్పుట జనించె
భూతములు, తద్విధాన విధాతయును బ్ర
జాపతియుఁ బుట్టి రని శ్రుతిసరణి లేదె? 222.

శా. ఆనారాయణశబ్దవాచ్యుఁడు శివుం డౌ నార మన్నల్ విధిం
ద్రానంతాదిన్యకోటి, యద్ది యయనం బౌవాఁడ నారాయణుం
డౌ నాదిత్యతతుల్ తదంశములె సుమ్మా భూద్యురాదిస్థితా
నానారుద్రులర్క నమస్సనెడు నామ్నాయంబు మానం బిటుల్ 223

గీ. ఎవనివలనఁ ద్రిమూర్తు లుద్భవము గనిరొ
తత్పరేశుండె కారణత్వమున జ్యేష్ఠుఁ
డైనచందానఁ దాన కార్యత్వమునఁ గ
నిష్ఠుఁ డగు నని వాకొనె నిగమ మరయ. 224.

ఆ. జ్ఞానమయు ననంతు సత్యుని బ్రహ్మ గుహా
నిహితు నెఱుఁగఁ దగు ననియెను శ్రుతికిఁ
బరఁగ లక్ష్యమైనవాఁ డమ్మహేశ్వరుఁ
డతఁ డొకండు జగదుపాస్యుఁ డెన్న. 225.

క. నిర్గుణుఁడ యయ్యు నీశుఁ డ
నర్గళ చిరకాల చింతనాయత్తుండై
సర్గ మొనరింతు నని యం
తర్గతిఁ జింతించి పెక్కునాళులు కడకున్. 226.

సీ. ఆత్మతేజంబు సూర్యాకారముగ, మనం
బును జంద్రునిగ, సత్త్వమును గుజునిగ
సర్వవాఙ్మయమును సౌమ్యునిగా, సుఖ
జ్ఞానపుంజమ్ము వాచస్పతినిగ
వీర్యమ్ము దానవాచార్యునిగాఁ, గ్లేశ
మును శనైశ్చరునిగా, ఘును సృజించె
వెలుఁగు సూర్యాదిమండలములు తత్తేజ
మునఁ గాని వెలుఁగనేర్చునె తమంత?
గీ. నిందులఁ బ్రమాణముగ గ్రహియించి పలుకఁ
జను 'న తత్ర సూర్యో భాతి చంద్రతార
క'మ్మని యుఁ 'దస్య భాసా జగంతి భాంతి'
యనియుఁ జాటెడు వేదమ్ము యతిలలామ! 227.

క. ఆనారాయణపదమున
కా నీశునివలన బ్రహ్మ యయ్యెఁ జుమీ ప్రజే
శానుఁడుగ, విష్ణు వయ్యెఁ బ్ర
జానీకాజనపాలనాధారుఁడుగన్. 228.

ఉ. పాయక తొంటినుండియును బ్రహ్మయు నీశుఁడు లేనిచుప్డు నా
రాయణుఁ డుండె నంచు శ్రుతియందు శ్రుతంబగుఁగా కభావమై
యీాయఖిలంబు డిందినను నీశుఁడు విశ్వజగన్నిదానుఁ డే
చాయ నభావ మొందఁ డని చాటదె వేదము యప్పరాత్పరుఁ. 229.

క. కర్మమునఁ బుట్టు లోకము
కర్మమున నశించు నను నిగమనూక్తిని ద
త్కర్మము కారణ మను టెటు?
కర్మము జడ మిడదు శివుఁడు గాని ఫలంబుఁ. 230.

గీ. ఈశ్వరు నభావునిగ గ్రహియించువాని
నిందనొనరించి, యున్నవానిగ నెఱుంగు
బహ్మవేత్తను వేదమ్ము ప్రస్తుతించెఁ
గను "మసన్నేవ స భవతి,యనువచనము. 231.

ఆ. కాన లోకకర్త యా నీశరూప వ
రాత్మ సంతత మ్ముపాసనమ్ము
సేయుచును దక్షిణచిహ్నమ్ము లొడల న
వశ్యముగ ధరింప వలయు నియతి 232.

—: శంకరులు శైవమతమును ఖండించుట :—

చ. అనవుడు శంకరుం డనె నహో సృజనస్థితినాశముల్ షావ
ర్చును దుహిణాబ్జనాభహరరూపము లొంది యొకండె దేవుఁడం
చును శ్రుతి యుండె; మాకును ద్విశుద్ధిగ నిష్టము; లింగధారణం
బున కెచటఁ గనంబడదు మూలము కావున మానఁగాఁదగుఁ. 233

వ. మఱియు వేదవేదాంగవేత్త నాభి కూర్థ్వమున సోమపురుషునుదర
దేశంబున నసోమపులును వసియించుట శ్రోత్రియమార్గంబు కాదె!

సీ. కైశిక శీర్షాలిక శ్రివో ఘ్రాణ క
పోల జిహ్వోష్ఠ చిబుక గళములు
నసంద్వయ ద్విబాహా పాణ్యురో నాభి
కటి దేశ లింగ ముష్కములు మఱియు
నంఘ్రిజంఘాయు గ్ర్వోష్ఠీవ వంక్షణ
వస్తి పాయ్వాది కావయవములును
నాలంబనములుగా నస్మదాదిక సర్వ
బృందారకులు మునుల్ పితృగణంబు
గీ. స్నానపానాన్నమిశ్రితం బైననిత్య
కృత్యములఁ దృప్తు లగుదు మం చీశుఁ డయిన
బ్రహ్మ యరుణకేతువునకు వక్కణింప
లేద శ్రోత్రియమూర్తి నిలింపు లునికి. 235.

క. సకలామరమయ మగు మే
నికిఁ దాపము గూర్పఁ గలుగనేరదు శ్రేయం
బకట! యనూచానుని మెయి
సకలామరు లుందు రనుచుఁ జాటవొకో శ్రుతుల్. 236.

క. 'చితిశ్యాష్ఠ మటుల వీఁ డెఁకఁ
బతితుఁ డగుత' మని శపించి వడిమీఱఁ బలా
యితు లగుదురు శీర్షాది
స్థితులు సురలు తాప మింత దేహము సోఁకన్. 237.

ఆ. కర్మయోగ్య మైనతన్మె దేవుతనువుప
వ్యాధి లేక తాల్చి నట్టి చిహ్న
మఱఁ బడిన సూర్యు నప్పుడ వీక్షింప
వలె, హ్రదమునఁ నేని వలయు మునుఁగ. 238.

గీ. ఈదృశాగమవాక్యంబు లెన్నొ కలవు
వినఁడు 'యోఽన్యా' ద్యనేకశ్రుతి భేదకలిత
మగునుపాసన గర్హణీయంబ యంచు
వక్కణించెను హేతువుల్ పెక్కుఁజూపి 238.

చ అవనిసురుండు కర్మచిత మైనసమస్తజగంబు లెన్న న
ధ్రువములుగా నెఱింగి, విరతుం డగు రాగమునుండి యాత్మవి
త్ప్రవరుఁ ద్రియాఁగతార్థవిదు బ్రహ్మముఁ దెల్పుమటంచు నాశ్రయిం
పవలె నటం చికొక్కశ్రుతి పల్కెను ముక్తికి వేద్య మాత్మయే.

వ. కాన నన్యచిహ్నధారణంబు వ్యర్థంబు ముక్తికి బ్రహ్మజ్ఞాన మొ
క్కండ సాధనంబు. 240.

క. కన రా కనుప్రవిష్టుం
డును గూఢుఁడు గహ్వరేష్ఠుఁడు గుహానిహితుం
డు నపూర్వుఁ డయిన దేవుని
గని యాత్మజ్ఞాని వాయు గాసియు ముదమున్. 241.

గీ. ప్రవచనమ్మునఁ బరమాత్మ పట్టువడఁడు
చిక్కఁ డమితశ్రుతంబుల, శేముషిని ల
భింపఁ డెవ్వఁడు వరియించుఁ బ్రీతిఁ దన్నుఁ
దన్నరుశరీరము వరించుఁ దప్పకుండ. 242.

ఆ. తనువులందు నతనువును, ననవస్థవ
స్తువులయం దవస్థితుఁడును గాఁగ
నమ్మహావిభుని బరాత్ముని ధీరుండు
మనన మొనరఁ జేసి వనట లుడుగు. 243.

గీ. ఆకసమ్మును గృష్ణాజినాదిక మటు
చుట్టగాఁ జుట్టఁజాలినచో నరుండు
స్వాత్మము నెఱుంగకయ భవానంతదుఃఖ
మును దరించు నటంచు వాకొనియె శ్రుతులు. 244.

క. అటు గాన గురునికరుణా
కటాక్షమున నాత్మవిద్యఁ గఱచి యభేద
స్ఫుటవాదసుధాస్వాదన
పటుతృప్తిం గనుము గురుని భక్తిఁ గొలుచుచున్. 245.

క. అని యుక్తియుక్తముగ గురుఁ
డన విని విద్వేషవీరుఁ డనులింగధరుం
డనయము ప్రీతుండై వం
దన మిడి యగ్గురులలామునకు ని ట్లనియెన్. 246.

శా. స్వామీ! నాకు శరణ్య మీవ, మును సంసారాహిదంష్ట్రావిష
వ్యామగ్నాత్ముఁడ నైతిఁ బ్రోవు, భవదచ్ఛామ్నాయవాగ్రీతిచే
నామూలంబు నశించె ఖేదము 'శివోహ' మ్మంచు నద్వైతవి
ద్యామాహాత్మ్య మెఱుంగఁ గంటిఁ జరితార్థం బయ్యె నాజన్మముల్.

క. నీవ మహాదేవసప
ర్యావాప్తఫలంబ వనఘ! యద్వైతసుధా
సేవధిదాతవు కావున
నీవ యనుత్తముఁడ విశ్వేశ్వరుకంటెన్. 248.

గీ అనుచు నుతిపాత్రుఁ డగుశంకరార్యుఁ బొగడి
యొయ్యన నమస్కరించి పాదోదకములఁ
ద్రావి తత్కథితాచారతత్పరుఁ డయి
త్రిప్పె నద్వైతమునకు స్వదేశ మెల్ల 249.

—: విపక్షశూలాది లింగధారులతో శంకరుఁడు వాదించి జయించుట :—

వ. అంత నవ్వృత్తాంత మెఱింగి విపక్షశూలుఁడు మున్నగులింగధారులు మఱి కొందఱు భూతిరుద్రాక్షధారులై లింగచిహ్నాతులై యుగ్రాకారముల వచ్చి యయ్యతీంద్రున కిట్లనిరి. 250.

ఆ. మాయవేష మూని మావాని బ్రామాణి
కమతదూరుఁ జేసి కుమతమందు
నిటు ప్రవేశపెట్టి యేఁగుచునుంటి నీ
కంటె వంచకుండు గలఁడె జగతి? 251.

సీ. "బ్రాహ్మణ్యమునకంటె వైష్ణవం బగ్ర్యము
త్తమము శైవం బెన్న దానికంటె"
నని చెప్పఁడే నారదున కజుం డటుగాన
నారూఢుఁ బతితు నేలా యొనర్చి?
తౌర 'నమస్తే' యటన్న వేదోక్తిసం
స్తుతుఁడు విశ్వాత్ముఁ డీశుండ కాఁడె?
యతఁ డఖిలాస్యోత్తమాంగకంఠుఁడు జగ
ద్వ్యాపి భూతౌఘగుహాశయుండు
గీ. కాన శివుఁ డొక్కరుఁడ సర్వగతుఁ డటంచుఁ
బురుషసూక్తము శ్వేతాశ్వతరమునందుఁ
బలికి విరమించెఁ గాన విశ్వస్వరూపుఁ
డభవుఁ డంచు నిరూపితుం డయ్యెఁ గాదె? 252.

గీ. హ్రీయు లక్ష్మియుఁ బత్నులం చిఁక నహస్సు
రాత్రియును బార్శ్వము లటంచుఁ బ్రస్తుతించు
వాక్యయుగళంబు శివపరత్వమె నిరూప
ణంబు నిశ్శంకముగను బొనర్చెఁ గనుము. 253.

గీ. గంగయే హ్రీ యటంచుఁ దద్ద్వారి లక్ష్మి
యనుచు వా రిర్వురకుఁ బతి యల్లశివుఁడ
యనుచు యామళమున స్కాందమునను గొన్ని
వాక్యములు పొల్చు విను మోతపస్వి! వాని. 254

వ తొల్లి హిమాచలంబున శివమౌళి గంగ డిగ్గ నుఱికిన దదీయభార సంభ్రాంతుండై రుద్రుండు హ్రీమతివై యుచ్చైర్వర్తనశూన్యవై బ్రహ్మవిష్ణ్వాదికారణం బగుపరమపురుషశ్రేష్ఠు నొందె యడంగి యుందువు గా కని యానతిచ్చిన మందాకిని హ్రీభారపీడిత యగుచు నప్పరమేశుజటాటవి భక్తి నణంగి వర్తించుటం జేసి హ్రీ యని బుధజనాభిహిత యయ్యె. 255.

గీ. ఆసదాశివు నంకపీఠాధిరూఢ
యగుచు నేటికి వెలుఁ గొందునట్టిశ్యామ
విశ్వమోహనరూప మహేశ్వరి యన
నలరుపరశక్తియే 'లక్ష్మి' యయ్యె నయ్య! 256.

ఉ. ఆగిరిరాజనందిని మహఃకణమందు జనించు నిందిరా
వాగయుతంబు; లీశ్వరునవార్యమహస్సున నిందిరాధిభూ
వాగధిపాదికోట్లు ప్రభవం బగు వారికి నాశ మబ్బినన్
వేగ సృజించు నాశివుఁడు; నేతృఁడు వారికిఁ దానె కావునన్. 257.

క. అచ్చపుఁబటికమునకు సరి
వచ్చెడుకుడివైపు దివసభావము, నైల్యం
బెచ్చునెడవైపు రాత్రిత
యచ్చుపడఁగఁ దనకు, నాపరాంబిక యొప్పన్. 258.

గీ. నేను నిత్యుండ మఱియు ననిత్యుఁడ నని
తన్ను సర్వాత్మకునిగ జగన్నిదాన

భూతునిగఁ జెప్పె సురల కిమ్మగ శివుండె
యని యథర్వశ్రుతిని గాన నగును వింటె. 259.

వ. మఱియు శివరహస్యఖండమ్మున శివుండె ధ్యేయుం డని చెప్పంబ
డఁదె? 260.

సీ. 'శివుఁడె ధ్యేయుం డని చెప్పఁగా దివ్యవా
చంయమాగ్రేసరసమితి సాక్షి
'జ్ఞానప్రదాత యీశానుఁ డొక్కఁడ' యని
ప్రకటింప మహితుఁ డౌశనుఁడె సాక్షి
'జ్ఞానసంవేద్యుఁ డీశ్వరుఁడే' యటంచుఁ ద
థ్యముగ వాక్రువ్వ వేదమ్మె సాక్షి
'స్వకభక్తవినుతశిక్షణవిచక్షణుఁ డుమా
పతి' యన శమనప్రభృతులె సాక్షి

గీ. 'నిత్యుఁ డీశ్వరుఁడే' యన నీరజోద్భ
వోత్తమాంగకమాల్యసంపత్తి సాక్షి
'యాది యంతమ్ము లేనివాఁ'డనఁగ సాక్షు
లాత్తకిరిహంసరూపు లాహరియు నజుఁడు. 261.

వ. అని యిట్లు జగత్కారణ మీశ్వరుం డగురుద్రుండ యని శ్రుతులం
దెల్లెడ నుల్లసిల్లుఁ గావున నాతండె జ్ఞేయుండు. రుద్రకాండమ్మునఁ
దప్తలింగాంక, రుద్రాక్ష, విభూత్యాదికధారణంబును, బీఠాద్యర్చ
నంబును, రుద్రాధ్యాయజపమును, సర్వకిల్బిషహరణకారణము
లనియు, శివరూపాపాదకము లనియు నిరూపింపఁబడె. 262.

గీ. స్తేయ గురుదారగమన మైరేయపాన
విప్రహత్యాది నేది గావించెనేని
యాతఁ డఘముక్తుఁ డగు లిప్తభూతియై వి
భూతిఁ బండి రుద్రాధ్యాయమును జపింప. 263.

ఉ. ఆవలఁ గోటిజన్మనముపార్జితపుణ్యము లున్ననే మహా
దేవునిపట్ల భక్తి పొడతెంచును, దద్దృఢభక్తి గల్గున
ద్భావుఁడు పాతకమ్ము లుపపాతకముల్ పొరివుచ్చి, ముక్తికిఁ
బోవు నటంచుఁ జెప్పెఁ గనవో శివగీతలయందు సత్తమా! 264.

వ. మఱియు నాశివగీతలయంద ధర్మార్థకామమోక్షములపార మొందఁ
గలవా రని మునులకై శివుండు తెల్పిన పాశుపతవ్రతక్రమంబు సె
ప్పెద వినుము. 265.

క. విరజాహ్వయదీక్షం గొని
హారాక్షములఁ దాల్చి భూతి నలఁదికొని నిరం
తరము శ్రుతిసార మనునీ
శ్వరనామసహస్రమును జపము సలుపవలెన్. 266

క. దాన నరత్వ మ్మఱి యీ
జ్ఞానతనువు గలుగ లోకశంకరుఁడు శివుం
డానతులయెడఁ బ్రసన్నుం
డౌ నని కైవల్య మొసఁగు ననియు వచించెన్. 267.

సీ. బ్రాహ్మణులకు విభూతిధారణ మవశ్య
మనుచుఁ గాలాగ్నిరుద్రవేదాంతసూక్తి
యలరుఁ గాన విభూతిమాహాత్మ్య మెల్ల
నెఱిఁగి వచియింప నెవ్వానితరము ధరణి. 268

క. ఔదల నొసటను మెడను శ్రి
వో దోర్యుగముల హారాక్షములఁ దాల్చు నరుం
డౌ దిగ్వాసుడు వాఁడ ధ
రాదివిజుం డయ్యెనా పరాత్పరుడె యగున్. 269.

చ. అనుచు నగస్త్ర్యసంహిత నిరాకులరీతి వచించు నంతఁ గా
దనఘ! "యత్ర తద్దేహుఁడు చిదాత్మమునొందఁ" డనన్ బ్రమాణముం
ట నటు ముముక్షువుల్ తనువునన్ శివలింగము ముద్రలన్ ధరిం
ప నగు నవశ్యమంచును విపక్షులనన్ యతివర్యుఁ డిట్లనున్. 270.

గీ. అట వివక్షిత మరయఁ గృచ్ఛ్రాదితాప
మనలతాపమ్ము గాదు -'కృచ్ఛ్రాదికృశుఁడై
తపుఁ' డని పేర్కొనినబృహన్నారదీయ
మున కతివిరుద్ధ మీరు పల్కినవిధంబు 271.

సీ. లింగాంకితాంగు రథాంగశంఖాంకితాం
గునినేని కన నీట మునిఁగి కాని
సూర్యుఁ గన్గొని కాని శుద్ధుఁ డౌఁ దప్తలిం
గాంకన తప్తచక్రాంకనులను
పాషండధర్మతత్పరులైనవారి వా
ఙ్మాత్రినే నర్చింపఁ గాదు మఱియు
హవ్యకవ్యమ్ములం దవ్వాఁడు త్యాజ్యుండు
త్యాజ్యంబు తద్వీక్షితాన్న మెపుడు
గీ. లింగచక్రాంకమాత్రి వేదాంగవేత్త
యగుచు వైదికాచారపరాయణుఁ డగు
నట్టిఁడేనియుఁ బతితుఁ డౌ నంచు నుండె
నలబృహన్నారదీయమం దరసికొనుఁడు 272.

వ. అంతియకాదు. మార్కండేయపురాణమ్మున నొకవ్యా పెుక్కండు
గలదు. తొల్లి గాయత్రితో విప్రులకుం బెద్దవాదు పుట్టుటయు నం
దమ్మహాదేవి కుపిద్ధయై మీరెల్లరు పాషండులై వేదోక్తకర్మదూరు

లును దాంత్రికాచారపరతంత్రులును నయ్యెద రని శపింప నాబ్రా హ్మణులు గజగజ వణంకి పాదంబుల వ్రాలి ప్రార్థింప నద్దేవి కరుణించి నావాక్యమోఘంబు మీరు కలియుగమున నధమవర్ణులై, వేదార్థహీనులు, లింగచక్రచిహ్నితులు, జ్ఞానకర్మపదభ్రష్టులుఁ, గామక్రోధాదిపీడితులు నై పుట్టి, యాయుగము మూవ్పదివేల వత్సరంబు లరుగ, నద్వైతార్థానుచింతకులై సత్యధర్మపరాయణు లయ్యెద రని శాపమోచనంబు చెప్పెం గావున లింగాదిధారణం బనార్యం బగుట స్పష్టంబకదా! 273.

క. మానసముతోడ వాక్కు
వ్వాని నెనయలేక వెనుకఁబడె నాసత్య
జ్ఞానాదిలక్షణున కెం
దేని నుపాస్త్యనవబోధమే యెసలారున్. 274.

గీ. దానికంటెను బ్రహ్మావతారుఁ డైన
శివునుపాసన శ్రుతులందుఁ జెప్పఁబడియె
దాని నిరసింప నెవ్వానితరము? చేయఁ
దగినదియు భూతిరుద్రాక్షధారణంబు. 275.

వ. అంతియ కాని లింగాదిచిహ్నధారణమునఁ బ్రమాణం బరయ మనుటయు శివభక్తాగ్రగణ్యుం డగువిపక్షశూలుం డిట్లను, నార్యా! ప్రమాణంబు లేక పోలేదు. వలయునేని యిదె తెల్పెద నాలింపుము. 276.

చ. మును త్రిపురాసురక్షయసముద్యములై సుర లంద, ఱాది వహ్నిని, నడుమన్ శశిన్, దుది రమేశు ఘటించి సృజించి యొక్కయమ్మును—దమలో నెవండు నది పూన సమర్థుఁడు గామి నెవ్వఁడో వని మది నెంచుచోఁ గలిపయూషురు లి ట్లని రంతరజ్ఞులై. 277.

క. జ్వాలనాదులు రుద్రుని యు
జ్జ్వల తేజంబులె; కృశానుచంద్రులు నేత్రం
బులు, హరి తద్దేహజుఁ, డ
ట్టు లగుట గా దిద్ది యమ్మృడునకు భరంబై. 278.

ఆ. అనఁగ దక్షుఁ గల్గునమరు లా నంచుఁ బ్రా
ర్థించి రంబికేశుఁ బృథులభక్తి
హరుఁడు గోరె సురల వరమొండు
పశువుల కేను బతిగ నుండ నిచ్చగింతు 279.

క. అనుటయు దేవత లని రే
మును నలినజుఁ డాది పసులము సుమీ, మా కె
ల్లను బతి వీ వని తాల్పఁగ
మొనసిరి లింగాదిచిహ్నముల దేహములన్. 280.

ఉ. అంతట నల్లె వాసుకి, శరాసము మేరువు, చక్రముల్ వివ
స్వంతుఁడుఁ జంద్రుఁడున్, రథము క్ష్మాస్థలి, వాజులు వేదరాశి, త
ద్యంత విరించి, గాఁగ సకలామరసన్నుతుఁ డౌచుఁ గాళికా
కాంతుఁడు తచ్ఛరాగ్నులను గాల్చెఁ బురత్రయితో సురారులన్.

గీ. కాన లింగాదిచిహ్నముల్ పూన న్యాయ్య
మేము సేవకులము పరమేశుచిహ్న
ముల నవశ్యమ్ము దాల్పంగ వలదె? సేవ్య
సేవకుల కిట్టిధర్మంబు చెల్లు గాదె. 282.

క. నావుడు శంకరుఁ డిట్లను
దైవతతతి లింగశూలధారు లనంగా

లేవు ప్రమాణము, ఁగపడు
దేవతలు హరాక్షభూతి ధృతినిరతు లనఁగ. 283.

క. అల కైవల్యోపనిషత్సూ
క్తుల 'శ్రద్ధాభక్తులను నకుంఠధ్యానా
కలన నెఱుఁగు మాత్మం' బన
నలరును, లింగాదిచిహ్న మగపడ దందుఁగ. 284.

గీ. జ్ఞానమునకు శూలాదిచిహ్నమ్ము లంగ
ములుగ నెందును గనరాద, బోధలిప్సు
జనులు ధరియించి రనుటయు విన మొకప్పు
గాన లింగాదిధృతి పాతకమున కగును. 285.

వ. 'నాన్యః పంథా విద్యతేఽయనా' యేత్యాదివేదవాక్యములు ము
ముక్షువున కపరోక్షజ్ఞానము వలయు నని తెలుపునే కాని యెందుం
దేహసంతాపాదికమ్ము వలయు నని తెలుపవే! మఱియు నయ్యది
శాస్త్రవినింద్యంబు. 286.

ఉ. తమ్మదయి తేంద్రుచిహ్న మగుఛత్రము భృత్యునియందుఁ గానఁగా
రాదు; మహేశచిహ్న మని రాజితభక్తిఁ దలంచి మీరు శూ
లాదులఁ దాల్ప నాగ్రహవశాత్ముల రేని యయోమయంబు శూ
లాదినిమాత్రిఁ దాల్పవలె నబ్బను భారము మాత్ర దానిచేఁ. 287.

మ "హరభక్తుండు భుజాదిభూషణముగా వ్యాళాదిచిహ్నంబులఁ ద
త్పరచిత్తంబునఁ దాల్పఁగావలె" నన భావ్యంబె? యేరజ్జువో
యురగభ్రాంతిని గాంచుమాత్రమునఁ ద్రాసోద్రేకసంజాత దు
ర్భరకంపావిల చిత్తుఁ డౌనరుఁడు తాల్పన్ జాలు టెట్లారయన్.

క. కావున నిష్కామరమతిఁ
బోవిడిచి త్యజించి చిహ్నములు వృత్తిహితక
ర్మావహితుఁడవై కనుమా!
జీవేశ్వైక్యానుభూతి స్థిరచిత్తమునన్. 289.

ఆ. అట్టు లాత్మబోధ మలవడెనేని య
జ్ఞాననాశనమ్ము గలుగు దాన
ముక్తుఁ డౌదు వన్యమున నెన్నఁటికిఁ గావ
టంచుఁ బలుక గురున కతఁడు మ్రొక్కె. 290.

వ. అట్లు మ్రొక్కి పశ్చాత్తప్తచిత్తంబుతోఁ గలంగి నలంగి. 291.

ఉ. వీతసమస్తచిహ్నుఁ డయి వేగ సపుత్రికబాంధవమ్ముగా
నాతఁడు శంకరార్యచరణాశ్రియలబ్ధవివేకభావితా
ద్వైతమతావలంబి యయి భాసిలెఁ; గొందఱు శైవు లంత న
ద్వైతమతప్రవిష్టు లయి తత్త్వ మెఱింగి చెలంగి రయ్యెడన్. 292.

---

ఆశ్వాసాంతము.

శా. మాద్యద్రావణ నక్రవారిజ వనీ మాతంగ! సుత్రామ పు
త్రోద్య ద్దుర్దమ కాద్రవేయ గిలనాత్యుత్సాహ పిత్సత్పతీ!
ఖద్యత్తాపస తాప హృత్యభినవాక్షీణాంబుమోహాబ్ద! బ్రి
హ్మాద్యారాధ్య పదాబ్జ పాంసు లగ నాబ్జాక్షీభవ త్ప్రస్థరా!

క. సగుణ భగవ త్సపర్యా
నిగమన పర నైకమత గణిత లక్ష్యాత్మా!
యగుణ భగవ దగణిత మహి
మగ వాఙ్మనసానవాప్య మాహాస పుంజా!

## మత్తకోకిలవృత్తము.

దుష్టశిక్షణ శిష్టరక్షణ దుష్కరవ్రత దీక్షితా!
భ్రష్టధర్మ పునఃప్రతిష్ఠితి రక్షణాత్తవతారకా!
హృష్టవేంకటరాయమంత్రి హృదీడ్య మందిరవాస సం
తుష్టమానస! ముష్ట దుర్దమ దుష్ట విద్విష దిందిరా!

ఇది శ్రీగురుకరుణాసమాసాదిత కవిత్వ 'కవితాభూషణ'
వెంపరాల సూర్యనారాయణనామధేయప్రణీతంబైన
శంకరవిజయంబున

సప్తమాశ్వాసము.

శ్రీగురుమూర్తయేనమః.

# శ్రీ శంకర విజయము

## అష్టమాశ్వాసము.

క. శ్రీత్ర్యంబక బింబా! గా
యత్రీంచితపురుషరూప! హస్తధృతలస
ద్ధాత్రీత్మజ! వేంకటరా
ద్ధాత్రీమరస్తుత్యనామ! దశరథరామా! 1.

వ. అవధరింపుము.

### శంకరుఁ డనంతశయనక్షేత్రమున కేగుట.

ఉ. ఆనియతాత్ముఁ డట్లచట నద్వయనీతిఁ బ్రతిష్ఠ సేసి స
న్మానితుఁడై యనంతశయనం బను క్షేత్రముఁ జేరి యాహరిన్
బూని భజించు చొక్కనెల పుచ్చుడు; వైష్ణవపాంచరాత్ర,వై
ఖానస, భక్త, భాగవత, కర్మవిహీన, సమాఖ్య తాద్విజుల్.

క. షడ్విధములవారు పరి
వ్రాడ్వరుదరిఁ జేరఁ బ్రాడ్వివాకుం డయి "వి
ద్విడ్వృత్తి విడచి మీ మీ
షడ్విధమతరూపములఁ బ్రసంగింపుఁ" డనఁగ. 4.

### భక్తమతనిరాసము,

సీ. అందు భక్తాఖ్య విష్ణుమతావలంబు
లనిరి- సర్వజ్ఞుఁడు జగన్నియంత యజుఁడు
నైనవాసుదేవుండె రామాదికావ
తారముల నెత్తె భూభారహారకముగ. 5.

క. మూఢుల మే మాదేవు ని
గాఢముగ నుపాస్తిసేసి కాంతుము తద్భా
సాఢ్యాకన మనుబుద్ధిని
రూఢిని వర్తింతు మని యెఱుంగుము మమ్మున్. 6.

శా. కౌండిన్యర్షికి సుప్రసన్నుఁ డయి లోకత్రాత యానిత్యానం
తుం డస్మత్సముపాస్యుఁ డైనభగవంతుం డింక నాచారవం
తుం డౌ 'కర్మము జ్ఞాన' మం చెఱుఁగవే స్వామీ! మాలోఁ గ్రియా
కాండాసక్తులు కొంద ఱుండి రరయంగా బ్రహ్మగుప్తాదికుల్. 7.

ఆ. జ్ఞానసరణి విష్ణుశర్మాదులము మేము
నడతు మనుచు యతియు జ్ఞానలక్ష
ణంబు తెల్పుఁడా యనంగ నీక్రియఁ దెల్పె
విష్ణుశర్మ సూక్ష్మవిధము దోఁప. 8

క. శరణం బనంతభగవ
చ్ఛరణం బని మిన్న కుంటె జ్ఞానము సుమి; యే
వారియాన లేక తృణమే
నటిమఁటఁ జలియింప నేర కవనిం బడునో. 9.

వ. అనుడు శంకరుం డవ్విష్ణుశర్మ కిట్లనె. 10

సీ. జనియించు శూద్రుఁడై జన్మమ్ముచేఁ గర్మ
మున జనించు ద్విజన్ముఁ డనఁగ నవ్వల
సంధ్య నుపాసింపఁ జను నిత్య; మన్యథా
యగునేనిఁ బ్రత్యవాయము ఘటిల్లుఁ
నహరాదివేళలం దగ్నిహోత్రాదిక
మును భక్తి మెఱయఁ బూజన మొనర్చి.

సకలభద్రము లొందఁజాలెడు విద్వాంసుఁ
డగు బ్రాహ్మణుం డంచు నిగమసూక్తి
గీ. లభినుతించును నిత్య మైనట్టికర్మ
మిట్లు గావున శ్రుత్యుక్త మైనకర్మ
మెల్లవారికిఁ గర్తవ్య మెపుడు; విధిని
విడువ వెత గల్గు నని మున్ను నుడివె మనువు. 11

క. క్రమ మఱి కర్మపరిత్యా
గముఁ దాఁ బ్రదికియు నొనర్చుకష్టున కాక
ల్పము నరక మ్మగుఁ; గర్మం
బమరదె స్నానామరార్చనాది యతులకేఁ. 12

కతిపయవత్సరములుగ వి
హితకర్మముఁ దొఱఁగువారి కెటు బ్రాహ్మణ్యాం
చితగతి యలవడు నను న
య్యతిపతిఁ గని విష్ణుశర్మ యనియె నిటువలెఁ. 13.

గీ. 'నాకు సప్తమపురుషుండు నాపము డఁట
వానిపిత సుంత కర్మతత్పరుఁ డటంచు
బాల్యమున వింటిఁ బెద్దలవలన' ననుచుఁ
దొలఁగు దూరము ముం దంచుఁ బలికె గురుఁడు. 14.

చ. అనవుడు విష్ణుశర్మ స్వగణావృతుఁడై వ్యథఁ గూరి వండరీ
తిని భువి వ్రాలి మ్రొక్కులిడి దేవ! మముఁ క్షమియింపు మన్నవా
నిని దగుపాచితంబున వినిర్మలుఁ జేయుఁ డటంచు శంకరుం
డనుటయు శిష్యులెల్ల గురునానతిఁ బాలనసేసి రయ్యెడఁ. 15.

క. ప్రాయశ్చిత్తముల విమలు
లై యెల్లరు కర్మనిష్ఠు లగుచు నపుడు వా
రాయతిపతిఁ గని బ్రాహ్మణ్యాం
బియెడ నీకరుణఁ గంటి; మిఁక ముక్తి యెటుల్? 16.

క. నావుడుఁ బరమగురుం డు ద
యావృతమతియై ద్విజాన్వయాచారములన్
సేవింపుఁడు నిచ్చ శివ,ర
మావిభు,రవి,విఘ్నప,త్ర్యంబా,పంచకములన్. 17.

సీ. పంచాయతనపూజ బ్రహ్మార్పణ మ్మని
నిష్కామబుద్ధిమై నెఱపవలయు
నటు నిత్యకర్మమ్ము లాచరింప మనంబు
విమలమ్మై జీవేశభేద మడఁగు
నాభేద మడఁగ మూలాజ్ఞాన మెల్లఁ బ
టాపంచ లగు; నది రూపణంగ
జ్ఞానమ్ము పొడతెంచు, దాన లింగశరీర
మస్తమించును, దాన నబ్బు ముక్తి
గీ. గాని వేఱొకదారి మోక్షంబు గలుగ
దనుచు వచియించునాచార్యునంఘ్రియుగళి
నగణుఁడై వ్రాలి యవ్విష్ణుశర్మ నిత్య
కర్మములఁ దత్పరతఁ జేయఁ గడఁగె నెలమి.

వ. స్మార్తాచారరతుండై భస్మంబునం జందనంబునంద్రిపుండ్రంబు దాల్చుచు, స్నానం బొనరించి మృత్తిక నూర్ధ్వపుండ్రంబు దిద్దుచుఁ బంచాయతనపూజాపరుండై యుండు నంతఁ గర్మమార్గగాము లగు బ్రహ్మగుప్తాదు లరుదెంచి వందన మిడి. 19

శా. స్వామీ! స్మార్తమతావలంబనులమై బ్రహ్మార్పణం బన్నధీ
నే మెల్లప్పుడు కర్మముల్ నెఱపుకొం చీక్షేత్రముల్ బాయ కు
న్నా మంచుల్ బలుకన్ గురుం డనె 'నికన్ బంచార్చనానిష్ఠఁ జే
తోమాలిన్యము వాసి, భేదమతికిన్ ముందు వీడం దగున్.

గీ. ఆత్మబోధాప్తి లింగదేహము నశింప
నద్వయము సచ్చిదానంద మైనబ్రహ్మ
మందుదు రఁటన్న, బ్రహ్మగుప్తాదు లెఱిఁగి
శంకరునిశిష్యు లైరి, స్వార్థ్యమ్ము గనిరి. 21.

భాగవతమతనిరాసము.

ఉ. అంత నొకండు భాగవతుఁ డొద్విజుఁ డయ్యతిఁ గాంచి పల్కె నో
క్కింతగ మామతంబు వినుమీ! 'సకలశ్రుతిలబ్ధపుణ్య, మ
త్యంతము సర్వతీర్థములయందలిసత్ఫల మొందు మర్త్యుఁ డ
శ్రాంతజనార్దనస్తుతివశంవదుఁడై' యను సూక్తి చొప్పునన్. 22.

ఆ. విష్ణుకీర్తనం బవిరతం బొనర్చుచు
శంఖచక్రచిహ్నశాలుల మయి
యజితితులసిపేరు లలికోర్ధ్వపుండ్రమ్ము
లమర నిందు నుందు మబ్బె ముక్తి. 23.

ఆ అనుడు శంకరార్యుఁ డనియెఁ జక్రాద్యంక
నము ప్రమాణవిరహితము వినింద్య
మనుచు నెఱుఁగ కక్కటా! భాగవతుఁడ నం
చనఁగ నెంత ధైర్యమును వహింతు? 24.

క. భగవంతుని మూర్తులు నా
లుగు దెఱఁగులు; వానిలోఁ దొలుతది పరాఖ్యన్
గగనాకృతి యగు, నది వా
గగోచరం బనఁ బ్రమాణ మాలింపగ దే. 25.

వ. 'యతో వాచో నివర్తంతే-ప్రాప్య మనసా సహ' అను నేతాదృ
శశ్రుతివాక్యంబుల నెఱుంగవే? అట్టి నిరాలంబస్వరూపునకుఁ జి
హ్నమేడ? దానిసీ మీరు దాల్చు టేడ? 26.

మ. హరికిన్ రెండవమూర్తి వ్యాసమభిఖ్యన్ సర్వలోకాత్ముఁ డై
పరఁగున్ శస్తుఁడ వేవి దాల్చు మది, యాపాదోత్తమాంగంబు చె
చ్చెరఁ దప్తంబుననో, మఱొక్కటనో; నాశంబొంది యాబొంది వే
నరదుష్ప్రాపము వైష్ణవత్వమును బొందం జాలె దాసంస్కృతిన్.

గీ. అచ్యుతుతృతీయమూర్తి మత్స్యావతార
మాది యగు నవి, తప్తలోహమున వాని
చిహ్నములు దాల్చు; శంఖాదిచిహ్న మేల?
విష్ణువటు లోహచక్రాది వెస ధరింపు 28.

క. అదిగాక విష్ణునాలుగ
వది యగుమూర్తియ శిలామయార్చామూర్తుల్
వదలక తనువు తదాకృతి
పదచిహ్నిత మాచరింపు బాలిశ! యిఁక నేన్. 29.

వ. అని తదీయచిహ్నధారణంబు నిందించి, దిగులొంది యున్న యా
భాగవత మతానుయాయియందుఁ గరుణ వొడమి యతిచంద్రుండు
మంజులఫణితి ని ట్లను. 30.

గీ. ఆలకింపుము విష్ణుచిహ్నము లవశ్య
ధార్యము లటన్న పాషండతను ద్యజించి
ఫలము పరమేశ్వరార్పణకలితముగ స్వ
కర్మములు సల్పి సంశుద్ధి గాంచి యంత. 31.

క. అద్వైతవాది యగుస
ద్విద్వాంసుని గొల్చి తదుపదేశమ్మునఁ గ
ర్మద్వంద్వబంధసంహతి
కుదాసము సెప్పి ముక్తి నొందఁగదోయీ! 32.

క. ప్రియతింపవలె ముముక్షువు
లయమున బోధమున కెపుడు 'నాన్యః పంథా
అయనాయ విద్యతే' యని
నయమున శ్రుతిఘోషణం బొనర్చుట వినవో. 33.

వ. అనుటయు నవ్విప్రదేవుండు మ్రొక్కి దేవా! మదీయపుణ్యపరిపాకంబున భవదంఘ్రిసరోజసందర్శనం బబ్బె నన్నుఁ గృతార్థుఁ గావింపవే యని వేఁడుటయు జగద్గురుండు కరుణాళుండై యిట్లను.

ఆ. చిహ్నములను వేసఁ ద్యజించి కర్మముల న
కామముగ నొనర్పఁ గడఁగు 'బ్రహ్మ
మేన నైతి' ననుచు నెద భావన నొనర్ప
బోధ ముప్పతిల్లి ముక్తిఁ గనెదు. 35.

వ. అని యుపదేశింప నావిప్రదేవుండు తదుక్తప్రకారమున వర్తించువాఁడ నని వందనం బాచరించి గురుని సేవించుచు నుండు నవసరంబున. 36.

### వైష్ణవమతనిరాసము

సీ. వాలుక "నోం నమో నారాయణాయ" య
న్మంత్రమ్మునుచ్చారణమున మరపి
తనువు తదీయముద్రలఁ బాంచజన్యసు
దర్శనమ్ములఁ జిహ్నిత మ్మొనర్చి
పటుతర సంసారబంధ ముక్తుండనై
వైకుంఠమున కేఁగువాఁడ నింక
నస్మాదృశులు వైష్ణవాగ్రిణుల్ పరమప
దం బైనయుం దుండఁ దగినవార

గీ. లని వచించుచు శార్ఙ్గపాణ్యాఖ్యవాఁడు
వైష్ణవుం డొక్కఁ డయ్యతిస్వాములకడ
కరుగుదెంచి చక్రాద్యంకనాదిఁ గూర్చి
పలికె నాడంబరంబు వాక్కుల నెసంగ. 37.

గీ. బుజములందు శంఖ రథాంగ ముద్రలఱుతఁ
దులసిమాలలుఁ దమ్మిపూసలు సెలంగ
ఫాలవిధృతోర్ధ్వపుండ్రులై పరఁగువారె
వైష్ణవులు, విశ్వభువనపావనులు వారె.

క. అనియెడుపురాణవచనం
బనఘా! 'చిహ్నములఁ దాల్ప నగు' నన మానం
బనుశార్ఙ్గపాణినామకుఁ
గని యనియె యతీంద్రుఁ డుక్తికౌశలమొలుకన్. 39.

మ. శ్రుతి నీయర్థము గానరా దరయుచో శ్రుత్యుక్తి యొక్కం'డత
ప్తతనుం డొందఁడుము క్తి'నాఁడనరుఁ"త ప్తం"బన్నఁ గృచ్ఛ్రాదికో
గ్రతప స్తప్తము గాని త ప్తపదముద్రాదగ్ధ మం చర్థ మె
ట్లు తగుక్ ము క్తికిధ్యానముక్ శ్రుతులు తెల్పున్ సాధనప్రక్రియన్.

వ. అంతియు కాని చిహ్నధారణవిధి శ్రుతుల శశివిషాణంబ. 41.

ఆ. బ్రహ్మవిదుఁడు ము క్తిఁ బడయు నం చనుసూ క్తి
నెఱుక యొకటె మోక్షహేతు వయ్యెఁ
బుణ్య మఱిన మ ర్త్యమును జొచ్చు ననుసూ క్తి
నబ్బు సంసృతియ తదన్యగతుల. 42.

సీ. త ప్తశంఖాదిముద్రల నిషేధింపవే
యలబృహన్నారదీయాదికములు

హారినముం డైతేఁ జిహ్వాధృతి నం చనుట ను
నో రాజ్యమాత్రి మానుగద తలఁప
నవరపర్ణుఁడు శిఖాయజ్ఞోపవీతాది
ధారణమ్మున ద్విజత్వమ్ము గనునె?
మోక్షమ్ము బ్రహ్మాత్మ బోధమ్మునను లభ్య
మనుశ్రుతిప్రమాణ్య మరయలేదె?

గీ. కాన "బ్రహ్మాఽహ" మని సదా ధ్యానమూన,
ద్వైతభావన నశియించు, దాన నపుడ
జీవుఁడే పరశివుఁ డయిపోవు, నదియు
యపునరావృత్తిముక్తిసమాఖ్య నొప్పు 43.

ఆ. అవిరతంబు మది 'శివోఽహం శివోఽహ' మ్మ
టంచు నెంచు నెవని కైనఁ గాని
తార్చు శివుఁడు తనదు తాదాత్మ్య మని శివ
గీత నాడివె" ననుడుఁ గేల్మోగిడ్చి. 44

ఆ. అల్ల వైష్ణవుండు నద్వైతమతదీక్షఁ
గందుఁ ద్వదుపదేశకలన ధన్యుఁ
డైతి, నచు గురునియడుగుఁదమ్ముల వ్రాల
నసి గురుఁడు ముక్తుఁ డగుమి యనిన 45.

క. ముదలఁ గొని స్మార్తధర్మా
స్పదుఁడై పంచాయతనసపర్యాపరుఁడై
మది ముద మందుచు నిజజన
పదవాసులఁ దనమతంబువలనికిఁ ద్రిప్పెఁ. 46.

వ. అట్లాతండు గురుకరుణామృతపానతుందిలహృదయా రవిందుండై
స్వమందిరంబున నుండె నంత. 47.

—: పాంచరాత్ర మత నిరాసము :—

గీ. తివిరి పాంచరాత్రాగమదీక్షితుం డొ
కండు సనుదెంచి యాచార్యుఁ గాంచి పలికె
భువిని ముక్తిప్రతిష్ఠాదిమూలభూత
మస్మదాగమమత మొక్కఁ డగును గాన. 48.

గీ. నిఖిలవిప్రుల కాశ్రయణీయ మస్మ
దాగమ మతంబ యన శంకరార్యుఁ డనియె
నాగమము శ్రుతి కవిరుద్ధ మైనగ్రాహ్య
మగును; గాదేని యగ్రాహ్య మఖిలమునకు. 49.

సీ. ఆయాగమము చెప్పు "నన్యమంత్రోపదే
శము నొందఁ గాదు వైష్ణవత" కనుచు
"నబ్బు బ్రాహ్మణత గాయత్ర్యుపదేశాన"
నన వైష్ణవతకుఁ జే టగును గాదె
గాయత్రిభావమే కలుగుచో విష్ణుమం
త్రశతాప్తినైన విప్రత లభింప
దా బ్రాహ్మణతయు రూపఱ వైష్ణవత యేల?
యటుగాక "మాకు గాయత్రి విష్ణు
గీ. శక్తి యగును శంఖాదిసంసక్తి ననిన
నిందుశేఖర, పంచాస్య, హృద్యమూర్తి
సర్వసంపూజ్య, శుభద, యీశ్వరియుఁ గాన
నల్ల గాయత్రి కాదొకో యభవుశక్తి? 50.

మ. కమలాప్తోద్గతదివ్యతేజమునకున్ గాయత్రియే హేతువై
యమరున్; విష్ణువు భానుమండలగతుం డౌఁ గాన నా దేవి త
త్కమలానాయకుశక్తి యౌనె కద, తత్పంచాననత్వం బనే
కము లౌరూపుల నొందు నాపెకుఁ దగుం గా యందు వేమో కదా. 51.

గీ. వ్యాహృతులనుండి గాయత్రి; ప్రణవమునను
వ్యాహృతులు, తన్మహేశ్వరునవలనఁ బ్రణవ,
మవతరించుట గాయత్రి శివునిశక్తి
"హరుఁడ సర్వకర్త" యనదె నారాయణంబు. 52.

గీ. ఎద్ది వేదాదిసంప్రోక్త, మెది తదంత
సుప్రతిష్ఠిత, మెది ప్రకృతిప్రలీన
మట్టి సర్వమున కవ్వల నభవుఁ డలరు
ననిన నారాయణశ్రుతిఁ గనినఁ దెలియు. 53.

ఆ. అష్టమూర్తి మూర్తులం దర్కుఁడొకటి, పం
చాననాదియుక్త వానిశక్తి
వైష్ణవునకు నీకు భవమూర్తి రవిఁ గొల్వ
రామి హాని యెదవు బ్రాహ్మణతకు. 54.

క. చెడుఁగాక బ్రాహ్మణత నా
కడరెను వైష్ణవత యందువా? యుభయభ్ర
ష్టుఁడ వైతి భావనాయో
గ్యుఁడవును నడపీనుఁగైతి వోసరి చనుమా. 55.

చ. అని యతి వల్క మాధవసమాఖ్యుఁడు వైష్ణవుఁ డొక్కఁ డిట్లన
ల్కెను "విను తప్తశంఖముఖకీలన వైష్ణవలోకమబ్బ నం
చు ననెడి పాంచరాత్రమతసూక్తి త్వదుక్తిని నష్ట మయ్యెనే
యనవుడు శంకరార్యుఁ డనె నాగమముల్ శ్రుతిసమ్మతిన్ మనున్.

క. ఆగమకథితాచారము
నైగమసమ్మతిని గాంచెనా? గ్రాహ్యంబా
నాగమ మగ్రాహ్య మగుఁ ద్రి
యీగమితవిరోధ మొందెనే నించుకయున్. 57.

ఉ. మానుగ వేద మొక్కటి ప్రమాణము సూవె యతీంద్రియార్థవి
జ్ఞానమునందు; నాగమము గ్రాహ్యము యా నిగమానుకూల మా
నేని; దద్విరుద్ధమగు నెద్దియుఁ గాదు ప్రమాణ మెన్నడుఁ
గాన స్వకర్మసక్తుఁడవు గమ్మిక బ్రాహ్మణధర్మసిద్ధికై. 58.

సీ. నియతస్వకర్మాభినిష్ఠుఁడ వైతేని
తొలఁగు మోహము విశుద్ధుండ వగుదు
తనయంతఁ దాన తత్త్వజ్ఞాన మవుఁ డబ్బ
నద్దాన ముక్తుండ వగుదు వీవు
తదితరమున ముక్తి యొదవ దియ్యర్థమం
దునఁ బ్రమాణమ్ము శ్రుతిని వినఁగదె
"తన్నును సర్వభూతములందుఁ దనయందు
సకలభూతములఁ గాంచంగఁ గనినఁ

గీ. బరతరాత్మంబు నొందు నితరముచే న
సాధ్య" మని యుండెఁ గానఁ బాషండచిహ్న
ముల విడిచి మోక్షసిద్ధ్యర్థముగ గణింప
వయ్య యద్వైతమతనిష్ఠ ననవరతము. 59.

చ. అనవుడు మాధవుం డపుడ స్వాన్వయులుఁ నిజదేశవాసు లౌ
జనములు దాను స్మృత్యుదితసంస్కృతులఁ గని యద్వయార్థ్వని
ష్ఠను సతతాగ్నిహోత్రబలిసాంధ్యవిధిప్రవణాత్ముఁడై తన
ర్చెను గురు నాజ్ఞ నౌదల ధరించి జగద్ధితబద్ధబుద్ధియై. 60.

వైఖానసమతనిరాసము.

వ. అంత 61.

సీ. నారాయణుం డస్మదారాధ్యుఁ డగుట మా
మతము కా దనఁగ బ్రహ్మకుఁ దరంబె

వైకుంఠపదమె భావ్యమ్ము "తద్విష్ణోః ప
 ర" మ్మను శ్రుతిప్రమాణమ్ము దాన
నజరుద్రు లుదయింతు రి హరినుండి యను శ్రుతి
 నారాయణుఁడు జగత్కారణ మగు
నాతఁ డంతర్యామి యఖిలలోకారాధ్యుఁ
 డజుఁ డనంతుండు విశ్వాతిశాయి

గీ. యనుచు వైఖానసమతస్థుఁ డైనవ్యాస
దాసుఁ డనువాఁడు తత్ప్రవిధమున కేఁగు
దెంచి ప్రణమిల్లి మఱియు వచించె యతిబు
ధునకుతో నిట్లు తద్భక్తలక్షణంబు. 62.

క. నెమ్మదిని హరి నిలిపి శం
ఖమ్ము రథాంగమ్ము భుజసఖములుగ నిఖిలాం
గ మ్మూర్ధ్వపుండ్రసంప
న్నమ్ముగ వైఖానసమతతత్పరుఁ డొప్పున్. 63.

మ. అనఁ బల్కున్ యతిమౌళి "పాలకుఁ డజుం డైనన్ ముకుందుండ యై
నను మాక్షిప్తమ నూ పునర్జననశూన్యం బావదం బొందఁ గో
రినఁ దత్త్వావగమంబె సాధనము పేర్మిన్ విష్ణుభక్తుండ వే
నానరింపన్ వలెఁ గర్మకాండ మనహంయుఖ్యాతిఁ దత్ప్రీతిగన్. 64.

గీ. అంతియేకాని తప్తశంఖాదిచిహ్న
ధారణము మానవలె, నిరాధార, మాగ
మము శ్రుతివిరుద్ధమై యప్రమాణ మగుట
వినవొకో యటుసేఁత బ్రాహ్మణ్యమునకె హాని. 65.

వ. అనుటయు వ్యాసదాసుండు 'స్వామీ తొల్లి దత్తాత్రేయపరమ
యోగి పంచముద్రాముద్రితాంగుండయ్యె, నామార్గమ్ము మెచ్చ

రు ముముక్షువులు గ్రహించి రని పురాణంబుల విస్త్రితంబ, కాన
జటాదిధారణమున కాపురాణంబుల ప్రమాణంబు, తత్సంస్కార
దూరునకు వైష్ణవత్వహాని తప్పదు. కాన భగవచ్చిహ్నధారణ
మావశ్యకంబగుటయు నాయాచార్యసార్వభౌముఁ డి ట్లనియె 66.

శా. దత్తాత్రేయుఁడు తత్త్వవేత్త, ఋషి, తత్పక్షుఁడముద్రావిధిన్
జిత్తం బుంచునె? యేప్రయోజనము సంసిద్ధించు నవ్వాని; కీ
వృత్తం బర్భుసులేని నమ్ముదురె? యేదేనిన్ బురాణంబునన్
దత్తప్తాంకనవృత్తమున్ వినము నీతత్త్వజ్ఞతల్ మెచ్చ నౌ 67.

వ. కాన మాధ్యమ్ము విడిచి సుఖింపుము, పురాణంబుఁ జిహ్నధార
ణం బస్త్రితచరం బగుట నగ్రాహ్య మని తెలియుము. 68.

మ. అలప్రహ్లాదునకున్, విభీషణునకున్, హ స్త్రీశ్వరాత్త్రానపా
దులకున్, ద్రౌవది, కాంజనేయునకు, గోధుగ్గోపికాశ్రేణి, కి
మ్మఁ జక్రాంకన మేగురుం డొనరిచెన్ మూఢత్వ,పాషండము
ద్రిఁబోనాడిచి బ్రహ్మమైతి ననుచింతన్ మోక్షమున్ గాంచుమా.

సీ. అంకధారణ మనవశ్యంభావి యంచేని
గరుడముద్రిలను గంధరఁ ధరింపు
శేషాహిచిహ్నముల్ చెక్కుల దాల్చు క
ర్మేంద్రియాగ్ర్యము లైనయిరుభుజాబు
శంఖచక్రాంకనసంపన్న మొనరింపు
జ్ఞానేంద్రియాభ్యర్ణగతము లైన
చెక్కులు లారీతిఁ జిహ్నితం బగునంతఁ
బగునట్లు కాంతు నిబంధనంబు
గీ. నిటుల స్వవిహితకర్మవిహీనవైష్ణ
వునకు నీ కగ్నిహోత్రాది హానుఁగు వడిన

మిగులునే కద బుగబుగల్ నెగడు గంధ
సారపుంబూఁత లమలవస్త్రముల ధృతియు. 70.

మ. అన వైఖానసుఁ డయ్యతిప్రవరు పాదాబ్జంబులన్ వ్రాలి యో
యనఘా! నీకరుణన్ వివేకి నయి చిహ్నత్యాగముం జేసికొం
టిని నా కీవ గురుండ వద్వయవిధానిష్ణాతునిం జేయు మ
న్నని ప్రార్థింప స్మితాస్యుఁడై యనియె నయ్యాచార్యుఁ డవ్వానికిన్.

ఉ. భావనసేయు "మే నయితి బ్రహ్మ" మటంచును శక్తి లేదయే
నావచనంబులన్ దలఁపు మాత్మను బాయక, యట్లు సేయుచోఁ
బోవును ద్వంద్వముల్, నమసిపోవు మదూర్మ్మ లెఱుంగు దాత్మమున్
నీవు విముక్తిఁ గాంతు, గననేరవు సూ పెఱతోవ మోక్షమున్.

క. అని బోధింపఁగ శిష్యుం
డనుఁ జరితార్థుండ నని మనంబున బ్రహ్మం
బ నయితి నని భావించుచుఁ
జనె యతిపతి కెఱఁగి స్వకుజనసంయుతుఁడై. 73.

కర్మహీన మతనిరాసము.

వ. ఆతం డట్లరుగునంత నామతీర్థుం డనుకర్మహీనవైష్ణవుం డేతెం
చిన శంకరుండు వానింగాంచి నీమ ంబు దెలుపు మనుటయు నా
తండు సగర్వంబుగా ని ట్లను.

సీ. అపరిధృవ్యమ్ము శేషాహికేనియు మన్త్ర
తంబు నాలింపు 'సర్వంబు జగము
విష్ణుమయం' బను విమలోక్తి కతన "మ
చ్ఛిష్యుఁ ద్వత్పదసరసిజయుగళిఁ

జేర్పుమా" యని గురుసింహుడు ప్రార్థింప
జగదీశ్వరుం డట్లు పలికితేఁ
గానఁ బునర్జన్మకారణాభావుండ
నగుచు జీవన్ముక్తి నందుకొందు

గీ. నీరును ముముక్షులేఁ గర్మహీను లగుచు
విశ్వమయుని సురేశుని విష్ణుఁ గొలువ
నయ్యెడరు ముక్తులుగ నిశ్చయంబు దీని
కంటె సుఖమైనమోక్షమార్గంబు లేదు 75.

వ. అనుటయు శంకరుండు సోత్ప్రాసంబుగ ని ట్లనియె. 76

గీ. పలికితి నిజంబు కర్మవిభ్రష్ట వగుట
నంది తీవు జీవన్ముక్తి నదిర! మదిని
నింద్యము వనింద్య మనుచుఁ జింతింపకయు పి
శాచవైఖరి వర్తింప సాగి తిటుల. 77.

వ. అని యుపహసించి వేదోక్తసకలకర్మంబులు బ్రహ్మంబున ఫలా
ర్పణంబుసేఁత జ్ఞానమార్గం బనియు ఫలార్థము కర్మము లొన
ర్చుట కర్మమార్గం బనియు నందు, రయ్యుభయమార్గంబుల భ్రష్ట
నగుట దండ్యుఁడవు కాని విష్ణుభక్తుండ వెన్నఁటికిఁ గానేరవువినుము.

క. తనకులధర్మము విడువఁడు,
గను సమత, హితాహితుల నొకనివిడువఁడు, హిం
సను జేయఁడు, సితమనసుం,
డనఘుఁ డెవఁడు వాఁడునూవె హరిభక్తుఁ డనఁగ. 79.

చ. స్థిరమగు మాయాజ్ఞలు శ్రుతిస్మృతు, లవ్వి యతిక్రమించువాఁ
డరయఁగ నాకు ద్రోహియు మదాజ్ఞలు మీఱుట; వాఁడుభక్తుమై

వరలినఁ గాఁడు వైష్ణవుఁ; డవార్యమదాజ్ఞను ద్రుంచి ద్రోహియై
నరకము సొచ్చు" నన్నవచనంబుల విష్ణుఁడె యొప్పెఁ గర్త్రముల్.

వ. 'బ్రాహ్మణః కర్మ కుర్వీ' తేత్యాదివాక్యములం జేసి కర్మత్యాగమును దేహాంతరత్యాగమును విప్రుల కొప్పద "అగ్ని ర్దేవో ద్విజాతీనా' మనువాక్యముచే బ్రహ్మచారిప్రభృతు లెల్లరు కర్మత్యాగ మొనర్పరాదు 81.

క. శమియించును గృచ్ఛ్రత్రిత
యమునఁ ద్రిసంధ్యాతిపాతజాఘ మనుటఁ గ
ర్మము ద్విజుల కపరిహార్యము
సుమి, "యతులకె త్యాజ్య" మనుచు శ్రుతి యానతిడెన్. 82.

ఉ. నావుడు నామతీర్థుఁడు ప్రణామములన్ గురుఁ దృప్తుఁ జేసి సం
భావితకర్మమార్గుఁ డయి వర్తిలుచున్, నిజపక్షఖండనం
బావిధి సల్పు శంకరుని యందలి నొజ్జగఁ గోరి నిష్కృతిన్
బానసు లాచు స్మార్తమతపద్ధతితోఁ గొని రద్వయాధ్వముల్. 83.

హిరణ్యగర్భమతనిరాసము.

క. అంతఁ బరివ్రాట్త్రిలకుఁ డ
నంతశయనవాస మెడసి యయి దహముల కం
తంతట సుబ్రహ్మణ్యా
ఖ్యాంతక్షేత్రమ్ము చేరె నట గుహుఁ గొలువన్. 84.

సీ. స్నానం బొనర్చి శిష్యశ్రేణిఁ గూడి కు
మారధారాఖ్యనిమ్నగకు నేఁగి
యర్చించె విధివిహితార్ఘ్యమునన్ భక్తి
షణ్ముఖదేవు శేషస్వరూపుఁ

దాల్చి కాషాయవస్త్రముల నచ్చుగను గే
ల్దోయి దండకమండలువులఁ బూని
మంద్రస్వరమునఁ ద్ర్యంబక ముచ్చరించుచు
భూతి సర్వాంగీణముగ నలందెఁ
గీ. బూర్ణభక్తి సుబ్రహ్మణ్యపూజ సలుప
నటకుఁ దండోపతండమై యరుగుదెంచు
దేశదేశాంతరస్థధాత్రీసువర్గ
సమితి కద్వైతబోధమ్ము సలుపఁ జొచ్చె. ౮౫.

ఉ. అందు హిరణ్యగర్భసముపాసనదీక్షితవిప్రకోటి క
ర్మందిమహేంద్రు సన్నిధికిఁ గ్రన్ననఁ జేరి వచించి "రార్య! మే
మంచితయిమ్ముగా మనువిప్రభృతు లర్థి సృజించిన కర్మమార్గ మిం
పొందఁ గ్రహించినారము పయోరుహగర్భకులోద్భవాప్తిచే. ౮౬.

చ. "తొలుత హిరణ్యగర్భుఁ డుదితుండయి భూతచయైకనేతయై
యిలను దినంబుఁ దాన ధరియించెను దాదృశదేవు మాని య
న్యులకు హవిర్విధింప" మను సూక్తి జగత్తుల కెల్లఁ గర్తయౌ
దలఁపఁగ భర్త, హర్తయు నతండ యటంచు వినిశ్చితుం డగున్.

సీ. నిఖిలంబు తాన వినిర్మించు, సర్వాత్ముఁ
డగుట నంతర్యామి యయి వెలుంగు
నవులఁ 'దదైక్షతే' త్యాద్యుక్తికథితుఁ డై
తా హరిహరుల దోర్ద్వయి సృజించు
నట్టి హిరణ్యగర్భాంఘ్రిభక్తులము కూ
ర్చకమండలువుల ధారణము విడక
యోగనిష్ఠను గర్మ మొనుగక ప్రచరించు
వారము వైధాత్రవంశజులము

గీ. యతిపతిని బూజ్యపాదు ని న్నరసి చారి
తార్థ్యమును బొందితిమి, కాని యస్మదుక్తి
వినుమి, యద్వైతమునఁ బ్రయోజన మొకింత
గానవచ్చునె యేల శుష్కశ్రమంబు? 88.

క. తలనూవు నలువ యెడ జీ
వులు నిజకర్మమున భవము పొందుఁ బోరిఁ బోరిన్
నలువ కడుపునన లయ మగుఁ
బ్రళయముతటి ముక్తి నెందుఁ బడయఁగ రామిన్. 89.

ఆ. బ్రహ్మవిదుఁడు పొందు బ్రహ్మలోక మదియ
పరమపదము గానఁ గరకదండ
ధారి వైననీవు తల్లోకయోగ్యుండ
వగుదు వనుచు నిట్లు యతి వచించె. 90.

ఆ. ఎవనివలనఁ బొడమె శివుఁడు బ్రహ్మాదిభూ
తములు, వాని నెఱుఁగఁ దడయ కబ్బు
ముక్తి-యనుచు వేదములు పల్కుఁ గాన బో
ధమ్మె మోక్షకారణమ్మె సుమ్మె. 91.

ఉ. అంతియ కాని సుప్తిసమ మైన లయం బెటు ముక్తి యౌను? వే
దాంతవచస్సదాశ్రుతిని నబ్బును బోధము, దాన మోక్ష మం
తంత లభించుఁ; గార్య మగునబ్జజసేవల ముక్తి నేక్రియన్
గాంతురొ మీ రనన్, విడిచి క్రన్ననఁ జిహ్మములెల్ల వారలున్.

క. శుద్ధాత్మబోధతత్పర
బుద్ధి నయిరి శిష్యు; లదియుఁ బొడగసి స్వమత
శ్రద్ధాళు లగుచ్యుపాసకు
లద్ధిరుని కడకు వచ్చి యని రీరీతిన్. 93.

వహ్నిమతనిరాసము

క. అనలమతరతుల మే మ
గ్ని నుపాసించెదము మంత్రనిగదితదేవుం
డనలుం డొక్కరుఁడే యని
మనమున భావింతు మిటఁ బ్రమాణము శ్రుతియే. 94

సీ. విశ్వంబు లేకుండు వేళను దొలుదొల్తఁ
బొడసూపె నగ్ని దేవుండు తాన
యయ్యగ్ని వెంట నుదయ మైన దేవతా
వితతి నుత్తముఁ డయ్యె విష్ణుమూర్తి
'యజమానుకొఱకునై యగ్ని హావిర్భాగ
ములఁ బరిపాటి వేల్పులకు నొసఁగ
మును పరిగ్రహణమ్ము నొసరించుఁగా' కంచు
నిగమ ముండుట భజనీయుఁ డగ్ని
గీ. విస్ఫులింగాత్మ మణిఖండవిధృతి నగ్న్యు
పాసకబ్రాణులు ముక్తిఁ బడయుదు రని
యగ్ని ద్విజులకుఁ దా దేవుఁ డనియు శ్రుతి వ
చించుటఁ ద్విజన్ములకు వేల్పు శిఖియు తలఁప. 9

చ. అదియునుగాక విప్రుల కఘాపహ మగ్నియ కాక దైవతం
బెదియును లేదు "వహ్ని! జ్వలియింపుమి, నాయఘపూరుష౯ హరిం
పు, దశదిశల౯ ఘటింపు సుఖపూరితజీవనము౯, బహూత్కరా
భ్యుదయము" నంచు వేదమున నుంట ద్విజాశ్రయణీయుఁ డగ్నిదే

వ. కావున మీరును నయ్యగ్ని సేవించి కృతకృత్యు లయ్యెదరు గా
యనుటయు నయ్యాచార్యేంద్రుం డి ట్లను. 9

గీ. దేవతలలోన నవముఁడు పావకుం డ
నుత్తముఁడు విష్ణుమూర్తి, తదుభయమధ్య
వర్తు లవశిష్టులైన దేవత లటండ్రు
కర్మదేవత దేవభాగదుఁడు వహ్ని. 98.

ఆ. అగ్ని కారణం బటన్న వాక్యములు భూ
తాత్మవహ్నిపరము లయిన, వగ్న్య
ధీనముగను గర్మ మూని సల్పుఁడు విష్ణుఁ
గొలువుఁ డధ్వరాధ్వగులరు గండు. 99.

చ. అదియ విముక్తికిన్ దెరు వటంచు యతీంద్రుఁడు బోధ సేయఁ ద
త్పదముల వ్రాలి మ్రొక్కి ప్రమదంబున నవ్యయమార్గ మూని, నె
మ్మదిని సుహోతృఁ డాది మతిమంతులు వారలు స్వాస్థ్య మొంద న
య్యదన యతీంద్రుఁ జుట్టుకొని రంచెల సౌరమతస్థు లీసునన్.100.

సౌరమతనిరాసము.

చ. అరుణసుమాంచితాంగు లరుణారుణరాంకవచేలధారు, ల
త్యరుణ కుచంద నాగ్నిశిఖ దర్పితచిత్రకు లా దివాకరా
ద్యరుణగభస్తిభక్తులు జయంబు గొనన్ యతిఁ గాంచి వీటికా
త్యరుణిమలిప్తదంతరుచు లాశలఁ గ్రమ్మఁగఁ బల్కి రీక్రియన్.

సీ. సర్వజగద్విలోచన మర్కుఁ డను శ్రుతి
బ్రహ్మాదిరూపుఁ డర్యముఁడు సూవె
యాదిత్యుఁ డితఁడు బ్రహ్మ యటన్న శ్రుతి సృష్టి
సంస్థితిహేతువు సవిత చూవె
ధృతి 'ఘృణి స్సూర్య ఆదిత్య' యన్మంత్రంబు
శిష్టజనం బుపాసింత్రు చూవె

జపకాలమునఁ దాల్పఁ జను రక్తచందన
తిలకరక్తలతాంతములను జూపె

సీ. కారణం బగుబ్రహ్మ యాకార మని భ
జింతురు కొంద ఱవ్యత్సరసీరుహాప్తు
నన్యులు భజంతురు విశ్వసంహారకుఁ డగు
నభవుఁ డితఁ డంచు గగనమధ్యస్థు సూర్యు. 102.

క. జగదుపసంహారప్రియుఁ
డగు హరుఁడె యుపక్రమించు నఖిలము సృజియిం
పఁగ ననియు హరుఁడె యును రూ
పగు ననియుఁ దలంచి కొంద ఱర్చింతురు రవిన్. 103.

మ. అతిదీర్ఘున్ రవిమండలంబున హిరణ్యశ్మశ్రుకేశాదిసం
యుతు దేవున్గని కొల్తురు కొంద ఱటు సూర్యున్ జూచుచు న్గొల్చు నా
వ్రతులం దేకతరుల్ గనుంగొని రవిన్ బాద్యాదిఁ బూజించి కా
ని తినం జూడర యన్నమున్ జలము నేనిన్ గ్రోలఁ బో రెన్నఁడున్.

చ. ఉరమున ఫాలమందు భుజయుగ్మమునన్ రవిమండలాకృతిన్
బరఁగెడు తప్తలోహకరణంబులఁ జిహ్నములన్ ధరించి సు
స్థిరహృదయాంతరమ్ముల భజింతురు సూర్యు ననుక్షణంబుఁ గొం
ద ఱిటుల యాఱురీతులఁ దనర్తురు ద్వాదశమూర్త్యుపాసకుల్. 105.

చ యమివర వీర లార్యుర కుపాస్యము మున్ను వచించినట్టి మం
త్రమె సుమీ భానుమండలపరంబుగ సంస్తుతి సేయు వేదవా
క్యములు పరస్సహస్రము; సహస్రశిరోక్షిపదుం డటంచు నా
ద్యుమణినె కాదొకో పురుషసూక్తము పెల్చ నుతించు నెంచుమా.

క. నిగమచయనిరూప్యుఁ డగుం
భగుఁడ "ఋత"మ్మనెడు రుద్రమంత్రంబునఁ బా

ల్పగు పురుషశబ్ద; మది సర
విగ రవిపర మౌను గృష్ణపింగళుఁ డనుటన్. 107.

వ. అరుణుండు సూర్యుండు భానుండు చంద్రుండు తపనుండు మిత్రుండు
హిరణ్యరేతసుండు రవి యర్యముఁడు గభస్తి విష్ణుండు దివాకరుం
డు నని యాదిత్యులు పన్నిద్దఱు. 108.

శా. ఆయాదిత్యులయందు విష్ణు వాఁకరుం డైయుంట నాసూర్యుఁడే
యయ్యెన్ విష్ణువు 'నేన విష్ణుఁడను జు మ్మాదిత్యులం, దేవ సు
మ్మయ్యా! జ్యోతుల నంశుమాలి రవి' నంచబ్జాక్షుఁ డప్పార్థుతో
నొయ్యం బల్కఁడె యబ్జజాదులు తదంశోత్పన్నులే కావునన్. 109.

క. పూని ముముక్షుజనం బీ
భానుని సేవింపఁ జనును బ్రత్యక్షముగాఁ
గాన నగుదేవుఁ డర్కుఁడె
నా నయ్యోగీంద్రుఁ డనెఁ దృణము సేసి పరున్. 110.

క. వినుమా మూఢ దివాకర
జనియించె మనంబునుండి చంద్రముఁడు చ
క్షువునుండి సూర్యుఁడు జనిం
చె ననుచు జన్యతను శ్రుతి వచించును రవికిన్. 111

గీ. తర్కసిద్ధాంతమున 'ననిత్యమ్ము జన్య'
మని తనర్పుట, నయ్యనిత్యునియెడ నెటు
సనును బ్రహ్మత్వ మర్కనిష్ఠపరమాత్మ
బోధకశ్రుతితాత్పర్యమును గ్రహింపు. 112.

మ. జగదీశాజ్ఞ భ్రమించు సూర్యుఁ డని సుస్పష్టంబు తద్భావ 'ఈ
జగదీశాజ్ఞకు భీతి నొందుచు నభస్వంతుండు వీతెంచుఁ ద

ద్భగుఁ డాత్త్రోదయుఁ డౌను వహ్ని వెలుగున్ భాసిల్లునిందుఁడు పె
ల్లుగ ధావించును మృత్యు వంచును శ్రుతుల్ ఘోషించు టాలింపవో.

చ. సమయము, రోదసుల్, జలదసంగతి, లేని యఖండబోధసౌ
ఖ్యమహితమూర్తి వెల్గెడు చిదభ్రపథంబున సూర్యచంద్రబు
ద్బుములుఁ దటిత్తులున్ వెలుఁగఁజాల వనల్ జ్వలనుండు లెక్క? వి
శ్వ మెవని వెల్గునన్ వెలుఁగు వానినె పాయక వెల్గు సర్వదా.

క. అనెడు శ్రుతిసూక్తిఁ బరమే
శుని తేజమునన వెలుంగు సూర్యాదిక మం
చును స్పష్టము; జ్యోతిష్శ్రుత
మునఁ దదనిత్యతయె స్పష్టముగఁ గన్పట్టున్. 115.

ఉ. "అంబుజగర్భవాసరము నాది గ్రహంబుల సృష్టియున్, దదం
తంబున నష్టియున్ గలుగుఁ, దత్సమయం బౌకకల్ప, మట్టిక
ల్పంబులు రెండు గూడుకొని బ్రహ్మకు నొక్క యహర్నిశం బటం
చుం బాడగట్టుఁ గాన నెటు సూర్యుఁడు బ్రహ్మకుఁగారణం బగున్.

క. తరణిస్థితుఁగాఁ గేవలుఁ
బరమాత్మ నె పొగడు వేదఫణితి యొఱిఁగి దు
ర్భరపామండాంకములం
దొఱఁగి సదద్వైతగతిఁ గనుండీ ముక్తిన్. 117.

క. అనుటయు సౌరమతస్థులు
వినతు లయి తదీయ శిష్యవృత్తి వెలయ నా
జనపదమునఁ గల భూసుర
జనులు యతీంద్రునకుఁ బూజ సల్పిరి భక్తిన్. 118.

క. ఇట్టుల జగద్గురుం డ
ప్పట్టునఁ గల ద్విజుల గౌరవమునకు గుఱియై

చట్టులు వెనుకొనఁ జనెన
ప్పట్టున విజిగీష వాయువం బగుదిశకున్. 119.

మ. కరతాళంబులఁ గాంస్యతాళముల శంఖధ్మానరీతిన్ శుభం
కరవాగ్రీతి మృదంగధింధిమిరుతిన్ ఘంటాధ్వనిన్ బింఛచా
మరతాలవ్యజనానిలంబులను సంభావించి సేవింతు రెం
దఱో మర్త్యపథ మయ్యతీందుఁ గని తత్తద్దేశవాసిద్విజుల్. 120.

క. సేవించిన ఫలముగ నా
యావిప్రులు కరుడు గట్టినట్టి కుశంకల్
వోవ నడఁచి తచ్ఛిష్యులు
నా వెలసిరి త్రోవపొడుగునను జితశ్రముగన్. 121.

క. దారి నరుగువాఁ డటనటఁ
దారిన ద్విజరాజి కమృతధారానిభవా
చారుచిరబోధమున భవ
తారకుఁ డయ్యెను శివావతారము కానన్. 122.

చ. యతిపతి యన్వహం బిటు ప్రయాణ సేయుచు శిష్యసంఘ సం
యుతుఁ డయి భిక్షలందుకొనుచొక్కొకయూరను విశ్రమించు చం
చితులగు దైవచింతకుల శిష్యులుగాఁ గయికొంచు వారు సం
సృతిఁ దరియించు త్రోవ వివరించుచుఁ జేరెఁ బురంబునొక్కటిన్.

క. ఆస్థానము గాణపతము
తాస్థాన మ్మటకు వచ్చు నన్యమతస్థుల్
స్వస్థితిఁ బరిణతిఁ గనక ని
జస్థానము సేర రంచు జగములు పలుకున్. 124.

క. గణవర మనుపుర మట యది
గణనాథాశ్రమము మోక్షకర మనియుఁ దరం

గిణి 'కౌముది' యని విని త
ద్గుణము లెఱిఁగి పొంగి నదిని దోఁగెఁ దొలుత౯. 125.

ఆ. అవ్యయుని గణేశు నర్చించి శంకరుఁ
డచట మానమాత్రి మధివసించెఁ
బద్మపాదముఖులు పంచపూజాపరా
యణులు శిష్యు లర్థి ననుచరింప. 126.

క. పరవిద్యార్దనచుంచులు
పరపక్షక్షపణచణులు వాద కథావి
స్తరవిత్స్తోక్తులు సరసిజ
చరణాదులు దిగ్గజప్రశంసాపాత్రంబుల్. 127.

వ. అట్టి శిష్యులం గూడి శంకరుం డగ్గణవరమునందలిగాణాపత్యమత
దీక్షితులు యతులకు భిక్షావందనమ్ము సేయుని వారని యెఱింగియు
నచోటు వాయక యొక్కమఠంబున విడిసి యుండె. 128.

ఉ ఆతఱిఁ బద్మపాదుఁడు తదాజ్ఞ శిరంబునఁ దాల్చి వడ్రిసో
పేతము వంటకమ్ము పచియించుచు శిష్యుల కెల్లఁ బెట్టుచు౯
బ్రీతిని దేశికాగ్రణికి భిక్షయొనర్చు చహర్దివంబునుం
బ్రీతిగ సేవల౯ సలుపు బ్రహ్మసమర్పణ మంచు సర్వము౯. 129

శా. సాయంకాలము ద్వాదశానతుల నాచార్యేంద్రు నర్చించి భ
క్త్యాయత్తాత్మకు లౌచు శిష్యులు సమిద్ధానద్ధవాద్యధ్వని
స్ఫాయత్తాలలయారవాయతమహేశస్తోత్రవాచార్భటి౯
జేయం జొచ్చిరి తాండవం బొకపు డంచెల్ గట్టి చిత్రంబుగ౯.

భుజంగప్రయాతము { అజర్యం బనూహ్యం బనాద్యం బనంతం
బజత్యాంబు బుద్ధిస్థ మద్వైతసారం

బజాండపరిజాధార మానందకందం
బజం బుక్త్యగమ్యంబు నా బ్రహ్మ మేనే. 131.

ఉత్సాహము { జితహృషీక మానిగమ్య చిన్మయంబు, సన్మయా
కృతి సదాశివాభిధానకీర్తితం బనార్తితా
రితభవాబ్ధి శుద్ధబుద్ధహృద్యరూపదీపితం
బితచరాచరంబు బ్రహ్మ మేన, యేన విశ్వముల్. 132

క. అని యిటు శివతాండవలీ
లను గురు నానందలహరులం దేలింపం
గని 'యిది యే' మని యచ్చెరు
వెనయుచుం జనుదెంచి రచటి యెల్లజనంబుల్. 133.

శా. తత్తాదృక్శివతాండవోత్సవము సందర్శించి వైవశ్యసం
పత్తిం గొందఱు చూప ఆదాకళులై భావప్రికర్షంబుగా
నృత్తంబుల్ బచరింప-గాణపతుల స్వీక్షించి యానృత్తమా
పత్తిం ముంచెనె మామతంబు ననుచుల్ వారించి యవ్వారితోం.

శా. సన్యాసుల్ పొనరించు తాండవము నస్మత్సృగ్ప్రహాస్థుల్ పొన
ర్పన్యాయంబాకో! యింకవీరిమత మద్వైతంబు 'వ్యోమంబటుల్
శూన్యం బద్వయమైనబ్రహ్మ;మగు'' మంచుల్ దెల్పుహృద్యాసగ
మ్యాన్యాయార్థ మెఱుంగు టెట్లని కరంబాక్షేపముల్ పల్కఁగల్.

వ. శంకరభగవత్పాదు లప్పలుకులు విని యది యట్లుండనిచ్చి ముందు
మీామాంసం బేదియో తత్స్వరూప మెట్టిదో దానికిం బ్రమాణమ్ము
లేవియో తెల్పుం డనుటయు వారల కగ్రేసరుం డగు గిరిజాసు
తుం డనువాఁ డిట్లనె. 136.

ఆ. మాది గాణపత్యమత మాఱు విధములఁ
దనరు నెల్ల శ్రుతులు తత్పరములె
యస్మతమ్ము నూన నత్యంత శాంతియు
ముక్తి నరుల హస్తమున నె పొదలు. 137.

గీ. అనఘ! తుండైకదంతచిహ్నాంకితుని స
శక్తికు మహాగణేశ్వరు స్వాంతమందు
నిలిపి తన్మూలమంత్రంబు నిష్ఠ జప మొ
నర్చుద్విజుఁ డొందు ముక్తి సనాతనముగ. 138.

ఉ. ఫుల్లసరోజపాణి మణిభూషణభూషితగాత్రి యైన శ్రీ
వల్లభఁ గూడి విశ్వ జని వర్ధన మర్దన మూలహేతువై
యెల్లరఁ గోర్కు లిచ్చెడు గణేశుఁడె ధ్యేయుఁ డటన్నసూక్తి నీ
యెల్లజగంబు విఘ్నపతియే సృజియించును బెంచు లోఁగొనున్.

ఆ. అబ్జజాదు లెల్ల రత్యయం బొందిన
నుండు గణపతియ యొకం డటంచు
శ్రుతి వచించుఁ గాన నతఁడ బ్రహ్మాది
గణేశుఁ డఖిలమునకు హేతు వరయ. 140.

క. కావునఁ దన్మాయామహి
మావిర్భూతుల యజాదు లని గాణపతుం
డావాది యనఁగ; గురుఁ డనె
దేవానాం ప్రియ! వినంగదే తత్త్వమ్మున్. 141.

చ. గణపతి రుద్రపుత్రుఁ డనఁగాఁ బ్రథితం; బెటు తండ్రి కాను గా
రణము సుతుండు? కాన నలబ్రహ్మము వైదికసూక్తి విశ్వకా
రణ మగు నీవు; నూపుశ్రుతి రాజిలుబ్రహ్మపదంబు బ్రహ్మ మా
గణపతిమాత్ర కా, దెటుల కారణ మా గణనాథుఁ డారయన్. 142.

క. అనిన గిరిజాసుతుం డో
యనఘ! భవదుక్తి సత్య, మైనను నీతాం
కనుఁ జిష్టదేవతాంతిక
ము కెటు చను? సనఁగ భిక్షుపుంగవుఁ డనియెన్. 143.

మ. వినుమా బాలిశ! బ్రాహ్మణాన్వయజనిన్ వేదోక్తకర్మాతిని
ష్ఠ సజస్రంబు శిఖాదిధారణమునన్ జ్ఞాత్మదేవతాభావ మ
బ్బును దన్మాత్రఁ గృతార్థుఁ డౌనుజుమి విప్రుం;డిట్టి సోహంకనా
దిని బాపండడమాత్రమే కలుగు ముక్తిన్ గాంచఁబోఁ డెవ్వఁడున్.

క. వేదవిరుద్ధంబు పురా
ణాదివినిందితము నగుట, నది మోక్షసుధా
స్వాద విలోలవి వేకి డ
నాదర్తవ్యమ్ము కాని దని తెలియఁ గదే. 145.

సీ. ఉండుఁ జతుర్దళం బుదిరిడాల్ గలుగు మూ
లాధారచక్రమం దలగణేశుఁ
డమరు షడ్దళము విద్రుమరుచి యైనస్వా
ధిష్ఠానచక్రానఁ దివ్రుట బ్రహ్మ
యలరును దశదళం బయి నీలవర్ణంబు
నగు మణిపూరకం బందున హరి
యడరు ద్వాదశదళంబయి పింగ మగుననా
హతచక్రమున భూతపతి శివుండు
గీ. వెలయు షోడశదళము ధూమ్రలవిభాన
మగు విశుద్ధచక్రమున జీవాత్మఁ డెప్డుఁ
బొలుచును సహస్రదళము కర్పూరవర్ణ
మైనయాజ్ఞాఖ్యమునఁ బరమాత్ముఁ డెప్డు. 146.

క. కావున గణపతి తనువున
నే వెలుఁగుఁ దదీయచిహ్నధృతి న్యర్థం బౌఁ
జూవె తదాజ్ఞాహ్వాయచ
శ్రావస్థితు సాక్షి నిర్గుణాత్ము నరయు నో. 147.

క. అఖిలోత్తముఁ బరమాత్ముని
నఖిలజగదతీతు సచ్చిదానందమయున్
నిఖిలశ్రుత్యుదితుఁ దలఁపు
ము ఖిలం బగు భవము; దొరకు ముక్తి తనంతన్. 148.

ఆ. అనుచు శుద్ధ మద్వయము శంకరుఁడు దెల్ప
సగణుఁ డౌచును గిరిజాసుతుండు
పంచయజ్ఞపరతఁ బంచపూజారతిఁ
జిహ్నములఁ ద్యజించి శిష్యుఁ డయ్యె. 149.

క. గిరిజాసుతుఁ డటు శంకర
చరణాశ్రితుఁ డగుటఁ గాంచి సరవి హరిద్రా
కరివదనభక్తుఁ డొకరుం
డరుదెంచి వచించె నిట్టు దురాగ్రహ మెసఁగన్. 150.

హారిద్రగణపతిమతనిరాసము.

శా. యానద్దేవగణోపదేష్ట్రకవిబృందాదేష్ట, బ్రహ్మాద్రిత
ద్దేవేశానగణేశుఁ డంబురుహసూత్రిత్రాణయుక్ శ్రేష్ఠరా
జై వెల్గొందు గణేశు నెంతు మనువేదాలాపమూలంబునన్
యావత్కార్యముఖార్చ్యుఁ డయ్యెఁగద విఘ్నాధీశ్వరుం డొక్కఁడే.

ఆ. కాన సర్వదేవగణపూజ్యుఁ డగు గణే
శ్వరుఁ డొకండె సుమ్ము, స్కాందమందు

నాగణాధినాథు ధ్యానంబు సంప్రోక్త
మయ్యె నది యతీంద్ర! యవధరిపు. 152.

ఉ. తాలిచి పాశసృణ్యభయదండములన్ శయపంక్తిచే హరి
ద్రాలసదాననం బుదిరిరంగుహారంగు లెసంగు జందెమున్
జేలము నుల్లసిల్లఁగఁ ద్రినేత్రచతుర్భుజశోభి యైన శుం
డాలముఖున్ భజించిన క్షణంబున మోక్షము గల్గు నేరికిన్. 153.

ఉ. ఆతఁడు విశ్వహేతువు, తదంశజు లబ్జభవాదు లౌట వి
ఖ్యాతు జగత్పితామహు గణాధిపతిన్ భజియింపు మీవు, బా
హాతటులందు నేకరదనాకృతిఁ దుండసమాకృతిన్ సుత
ప్తాతతలోహముద్ర లనయంబు ధరింప విముక్తి చేకుఱున్. 154.

చ. అన విని విశ్వవేది కరుణాంబుధి యాగురుఁ డిట్లు పల్కె "నీ
వనిన జగన్నిదానమె పరమాత్మ మగున్ బహునాముఁడైన యా
శునకు గణేశనామమును జొప్పడు రుద్రుఁడె పుత్రరూపమున్
గొనెఁ జుమి యంశికంశమునకున్ బొడసూపునె భేద మింతయున్.

గీ. కాన సర్వాత్ము సర్వవిఘ్నప్రహర్త
భక్తు లగువా రుపాసింపవలయు, నతఁడె
సర్వదుఁడు గాన విప్రు లర్చనము సలుప
వలె గణేశాదిపంచదేవతల నెపుడు. 156.

ఉ. మోదమునన్ ముముక్షుజనముల్ గొలువందగు నంతెకావి తుం
డ్రాదికచిహ్నసంధృతి నిరాకృత మయ్యెఁ బురాణసంహతిన్
వేదములందుఁ గాన నవి వీడి నిరంతరదీక్షఁ బంచపూ
జాదు లొనర్చి యద్వయమతప్రుఁడవై భవమోక్ష మొందుమా.

ఆ. అనుడు గణకుమారుఁ డయ్యతీంద్రునకు ద్వా
దశనతుల్ ఘొనర్చి తత్కటాక్ష

విమలుఁడై జగద్గురు మది ధ్యానించుచు
బంచపూజనాదిపరతఁ దనరె 158.

ఉచ్ఛిష్టగణపతిమతనిరాసము.

వ. అట్లు గణకుమారుం డద్వైతమతావలంబి యగుట యెఱసి హేరంబసుతుం డను నుచ్ఛిష్టగణపత్యుపాసకుం డరుదెంచి మహాగణపతి హారిద్రాగణపత్యుచ్ఛిష్టగణపతి నవనీతగణపతి స్వర్ణగణపతి సంతానగణపతు లను నుపాస్యవస్తువుల భేదంబున గాణపతమతంబు షడ్విధం బని శైవాగమకథితం బయ్యె అందు నుచ్ఛిష్టగణపతియ మా కుపాస్యుండు. వామమార్గావలంబనమున నుచ్ఛిష్టగణపతి యనఁ బరఁగుఁ దత్స్వరూపం బించుక వివరింతు వినుము. 159.

క. వినుతింతుఁ జతుర్భుజుఁ ద్రి
నయను పాశాంకుశగదాభయాంచితుఁ దుండా
గ్రనిపీతమధుకు గణనా
థుని రాత్రిందివము భక్తితో నోరారన్. 160.

క. ధ్యానింతు మహాపీఠా
సీనుని వామాంకమున వసించెడు దేవిన్
బూని కవుంగిటఁ దుండము
చే నచ్చోటిని స్పృశించి చెలఁగెడువానిన్. 161.

ఉ. దక్షిణవామ మార్గముల ధ్యానము లీగతిఁ బ్రోక్తమయ్యెఁ బ్ర
త్యక్షముగాఁగ జీవపరమాత్మల యైక్యమువోలె నైక్య, మా
పక్షయుగంబునందుఁ గనుపట్టు టెఱింగి భజింతు భక్తిఁ దా
దృక్షపథద్వయంబు, ధరియింతు నొసంటను గుంకుమాంకముల్.

సీ. [illegible] స్వచ్ఛందరీతిఁ గర్మము లొనర్చు
కొనుచు నుచ్ఛిష్టగణపతిం గొలుచుచుండు

దీని కేనయైన సుత మెందుఁ గాన నంచుఁ
బ్రతినిమిష మందుఁ గందు హర్షమ్ము మదిని. 163.

సీ. మఱి మామతమున ధర్మ మ్మొకండు గలదు య
తీంద్ర! పూరుషు లెల్ల రేకజాతి
చాన లెల్లరు నేకజాతి వా రౌట స్త్రై
ణము లెల్లఁ బురుష భోగ్యములు సుమ్ము
దురితంబు వొరయదు నరనారులకును సం
యోగంబునందు వియోగమునను
నితఁడె యీ మగువకుఁ బతి యంచు నియమమ్ము
కన; మొండొరుల సంగమున లభించు
గీ. నట్టి యానందమే ముక్తి "యల గణేశుఁ
డరయ నానందమయుఁ డంచు నబ్జజాదు
లతని యంశము లంచు నంశాంశులకు న
భేద మంచు వేదమె పల్కు లేదె యనఘ. 164.

వ. మఱియు 'గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమ' యని శ్రుతియందు రుద్రుండ గణపతిగాఁ బేర్కొనఁబడు, 'న కర్మణా' యను శ్రుతి యందు సహిష్ణుతాదిగుణయుతం బగు త్యాగంబె కాని, మోక్షం బునకుఁ గారణంబు కర్మంబు కా దని గలదు గాదె మామతంబునఁ బుణ్యపాపాదులంద ద్వంద్వత వెలయుఁ గావున నింతకంటె ముము క్షుసేవ్యం బెద్ది గలుగు ననుటయు నాచార్యవర్యుం డిట్లను. 165.

క. కలు ద్రావఁ జనదు పరనా
రులఁ గవయఁగ రాదటంచు శ్రుతి దూఱినచేఁ
తలుఁగల మతము త్యజింపఁగ
వలె మోక్షార్థులు స్మశానవహ్నివిధమునన్. 166.

ఉ. అద్వైతతత్త్వవిత్తు దళితాంహుఁడు నా యతికే 'నకర్మణే'
త్యాదికసూక్తి ముక్తిరమ యబ్బుటఁ దెల్పెను గాని మద్యపా
నాదరుఁ డన్యదారరతుఁ డౌనఘవృత్తికిఁ దెల్పెనే? సురా
పాదులు ముక్తిఁ గాంతు మని యార్చుట దౌష్ట్యము దుఃఖదంబగున్

ఉ. కావునఁ ద్యజించి యామతము గ్రన్నఁ బ్రసన్న ధరాసురోక్తిచేఁ
బూనిక నిష్కృతిన్ బడసి మోక్షపదాప్తికిఁ బంచయజ్ఞముల్
మానక, పంచదైవతసమర్చన సల్పుచుఁ, బాపదూరులై
మానసశుద్ధి జ్ఞానమహిమన్ గృతకృత్యులు గందు మీ రికన్. 168.

క. ధృతి మూలాధారాది
స్థితుల గణేశాదులను మతిన్ గను చజపాం
చితమంత్రాసక్తులరై
సతతము చరియింపఁ గొందు రీ శాశ్వతముక్తిన్. 169.

నవనీతగణపతిమతాదినిరాసము.

వ. అనుటయు హేరంబసుతాదు లట్లయొనర్చి కృతకృత్యు లగుటయు,
నవశిష్టులగు నవనీత, సువర్ణ,సంతానగణపతిమతస్థులగు వీరభద్రా
దు లరుదెంచి శంకరునితో "స్వామీ! యీజగం బంతయు గణ
పతిస్వరూపంబుగ మోక్షార్థులమై ధ్యానింతుము. సుఖార్థులగుజను
లకుఁ బూజ్యం బగు మా మతంబు మీ రెట్లు దూషించిరో వింత
యయ్యె నన నపుడు మీరు మూఢులరు శాస్త్రతత్త్వంబు నిద్దె తెలి
పెద వినుం డని గురుచంద్రుఁ డిట్లనియె. 170.

సీ. మును మహత్తత్త్వమ్ము పురుషాధిష్ఠిత
యగు ప్రకృతిని నుదయంబు నొందె
నామహత్తత్త్వమ్మునందుండి త్రిగుణాత్మ
క మ్ముత్పతిలె నహంకార మనఁగ

సద్గిరియే రుద్రవిష్ణ్వాదిరూపం బయ్యె
నారుద్రనం దుదయమ్ము గనిరి
సుతులు మువ్వురు గణపతి కుమారస్వామి
భైరవుం డనెడు నాహ్వయము లొంది

తే. వారు స్వస్వాధికార నిర్వహణ సక్తు
లగుట నాయాయిచక్రములందు వెలుఁగు
నగ్గణేశాదులే ధ్యేయు లైరి విప్ర
వితతి కింక నశక్తులవిధి వచింతు. 171.

క. అది శాంభవి హరి లం
బోదర శంకరులనఁగ మహోన్నతిఁ గను నా
యైదుగురు దేవతల ధర
నీదేవుఁడు పూజసేయ నిత్యము వలయున్. 172.

మ. అను నాచార్యుని సూక్తిజాలనమునులై యావీరభద్రాదు లా
య్యనఁ జిహ్నాంబుల నూడ్చివైచి గురుపాదాబ్జంబులన్ వ్రాలి పె
ల్చనఁ దచ్ఛిష్యతఁ గాంచి పంచసురపూజాపూర్వకాద్వైతరీ
తి నితాంతామలమానసాబ్జు లయి యుర్విన్ బొంది రబ్రింబుగన్.

మ. పరపాషండమతాళి నుక్కడఁచి యద్వైతార్థవాగ్వృష్టిఁ గ్రు
చ్చుటఁ జోళద్రవిళాదిదేశజులఁ బాదాక్రాంతులన్ సల్పి, త
త్కరి శైలేంద్రనితంబకాంచి యగు శ్రీకాంచిన్ సురాగారమున్
బరవిద్యాచరణానుసారిగ రచింపం జేసి కర్మంది తాన్. 174.

ఆ. శాంతికులను శాయఁ దటిమి కామాక్షికి
భగవతికి సపర్య నిగమసమ్మ
తమ్ముగా ఘటించి తత్పురి నొకనెల
శంకరుండు శిష్యసహిత ముండె. 175.

సీ. శంకరసంప్రతిష్ఠాపూర్వకముగ ని
ర్మించె వీటిని శివకాంచి యనఁగ
వరదరాజస్థానవాటి యావీటి సృ
జించె నర్మిలి విష్ణుకాంచి పేరఁ
దద్దేవతార్చనార్థ మ్మనేకులను వి
ప్రుల భక్తజనులను నెలవుకొలిపె
వారి శుద్ధాద్వైతవర్తులఁ దత్యంత
తాత్పర్యనిష్ఠులఁ దగ నొనర్చె

గీ. నందుఁ బార్థివమూర్తితో నిందుమౌళి
యంబరేశ్వరుఁ డన లింగమై వెలసెనొ
యట్టి కాంచీపురమ్మందు యతివిభుండు
ప్రతిపదము జ్ఞానసుధ వెల్లువగ నొనర్చె. 176.

తామ్రపర్ణీతీరవిప్రులకు జ్ఞానోపదేశము.

గీ. అపుడు తామ్రపర్ణీతటమ్మందునుండి
వచ్చి రెందఱో తద్దేశవాసిజనులు
పరమగురునకు మ్రొక్కిరి భక్తిమీఱఁ
బృచ్ఛ సేసిరి శంకానివృత్తి కిటుల. 177.

వ. స్వామీ! యీలోకంబున దేహాదిభేదంబు ప్రత్యక్షం బగుటంజేసి యు, నెవ్వల నానాకర్మంబులచేతను నానాయుపాసనలచేతను దత్తల్లోకప్రాప్తి కలుగు నని శ్రుతం బగుటంజేసియు భేదమే వా స్తవిక మట్లు తోఁచుచుండుఁగాదె యనుటయు నాచార్యుం డిట్లను; ద్విజులారా! పరమార్థతత్త్వ మెఱుంగ కిట్లంటిరి. ముక్తునకు సర్వ మాత్మయే యగునపుడు వేనిచే దేనిని జూచు నను నర్థము గల 'యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూ త్తత్కేన కం పశ్యే' త్తను శ్రుతిచేఁ దత్త్వజ్ఞానాగ్ని దగ్ధపాపపంజరునకు ముక్తావస్థయందు భే

దాభావము ప్రతిపాదిత మగుటవలనను 'దానిని (జగత్తును) సృజించి యం దదియే ప్రవేశించును, జీవాత్మతోడి యనుప్రవేశమున నామరూపవికారములం బొందు' నను నర్థము గల 'తత్సృష్ట్వా తదే వానుప్రావిశత్, అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' యను శాస్త్రతాత్పర్యముచే జగత్కర్త యగు బ్రహ్మమునకే జీవరూపమున జగదంతఃప్రవేశము విదితం బగుటవలనను, '..తి దేవా' యని యుపక్రమించి 'త్రయశ్చ త్రీచ శతా, త్రయశ్చ త్రీచ సహస్రా' మ్మని దేవతల యనేకత్వము దెల్పి యంతర్భావక్రమమున 'దేవుఁ డొక్కఁడే' యనియు, నతఁడే ప్రాణమనియు, బ్రహ్మ మనియు బ్రహ్మమునకే యనేకత్వము ప్రదర్శింపఁ బడె. మఱియు 'బహు స్యాం ప్రజాయేయ' యను శ్రుతిచే భోక్తృభోగ్యాత్మకం బగు సకల ప్రపంచమునకును బరమాత్మరూపత్వము ప్రతిపాదింపఁబడుటం జేసి సర్వజ్ఞమును నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమును సకలవివర్తాధిష్ఠానమును నగు పరబ్రహ్మము ముముక్షువుల కుపాస్యము కావున మీ రెల్లరును. 178.

ఆ. జీవపరమాత్మభేదంబు దేవతావి
భేద ముడిగి శుద్ధాద్వైత మైదనర్పు
బ్రహ్మము నెఱింగి మోక్షమ్ము వడయుచలె న
టంచు యతిసింహుఁ డుపదేశ మాచరించె. 179.

మ. నిజపాదాంబుజసేవకై యడఁగువన్ వేంచేయు కాంచీపురీ
ప్రజ నద్వైతమతస్థులన్ సలుపుచోఁ బ్రవన్ దామ్రపర్ణీతటీ
ద్విజులన్ సల్పియు,నాంధ్రులన్ మనిచి, భక్తిన్ వేంకటేశాంఘ్రివా
రిజముల్ గొల్చి, విదర్భరాజపురిఁ జేరన్ లోకు లగ్గింపఁగన్. 180.

క. ఎదురు సని భక్తియుక్తిని
విదర్భపతి పూజ సేసె, భిక్షుకశిష్యుల్

పదపడి భైరవపూజా
స్పదుల మదం బణఁచి రౌక్కపతి ధీశక్తిన్. 181.

వ. అచటినుండి కర్ణాటదేశమున కేఁగ శంకరాచార్యుండు దలపోయుచుండ విదర్భరాజి ట్లను. 182.

శా. కర్ణాటావనిఁ బర్యటించెదు కదంకన్ వత్తురీ రంచు నా
కర్ణింతున్, విన లేదె యద్దేశము ముగ్రింపశ్యకాపాలికా
కీర్ణం, బన్యమతోపదేష్టృజనతాకీటోర్ణనాభం, బన
భ్యర్ణం బాస్తికకోటి కంచు, విరమింపంజూడు మాయత్నమున్.

ఆ. అన నధిజ్యధన్వుఁ డౌచు సుధన్వుఁ డి
ట్లనియె వీఁడె భక్తుఁ డండ నుండ
భయము నీ కదేల ప్రతిపక్షు లగుపాము
రాళివలన స్వామి! యనుచుఁ బలుక. 184.

ఉ. వైళము యేఁగెఁ దీర్థకరవర్యుఁడు శంకరదేశికుండు కా
పాలికజాలకంబు గెలువన్ ధృతి వీడక కన్నడాన క
వ్వేళను శంకరాగమనవృత్త మటన్ క్రకచాభిధానకా
పాలిక దేశికుండు విని పట్టఁగరాని దురాగ్రహంబునన్. 185.

క్రకచుఁ డను కాపాలికుని చరితము!—

చ. పితృవనభస్మలిప్తతనుభీకరుఁడై నృకరోటిశూలసం
యుతకరయుగ్మ మొప్పఁ దన కుద్ధగ వేసము దాల్చి పెక్కురు
ద్ధతగతి వెంట నంటఁగ మహాసునుఁ డౌచు నఖర్వగర్వభా
షితముల నిట్లు పల్కె యతిశేఖరుఁ జేరి యనాదరంబునన్. 189.

చ. బసుమము మై నలందితివి బాగగుఁ గాని కరోటిఁ దాల్ప క
ప్పసముగ బొంతఁ దాల్తువు కపాలియుపాసన లేద, రక్తసి

క్రసితవరోత్తమాంగములఁ గల్లునఁ బూజ లొనర్ప కట్టిఁ గో
త్రిసుత కవుంగిటన్ వివశతం గనుభైరవుఁ డొందు మోదమున్

చ. అని యిటు భైరవాగమరహస్యములన్ వివరించు వాని నీ
చుని మొదవట్టి త్రోయుఁ డనుమన్ గడు నల్గి సుధన్వుఁ డాజ్ఞ యి
చ్చినక్షణమే తదీయు లగుసేవకు లాసభనుండి పాఱమూఁ
కిన భ్రుకుటీభరాస్యుఁ డయి కేలఁ బరశ్వథ మూని వాఁడునున్.

గీ. వరుస మీఁదిమీఁదిశిరంబులు నఱుకనేని
నేను గ్రికచుఁడనే యంచు నీచుఁ డతఁడు
కరలి వగచాటి పోయి యుమ్మరకపాలి
తతి యతుల మీఁది కనిపె వధం బొనర్ప 189.

క. అలిగి కపాలిబలంబులు
ప్రళయాంభోధర భయంకర క్ష్వేళలతో
బిలబిల మని వచ్చి యతుల
నలమె నసంఖ్యాకముగ నుదాయుధ మగుచున్. 190.

గీ. అంత నవ్విప్రకులము భయాకుల మయి
పఱచు టరసి సుధన్వుండు పట్టరాని
యలుక సన్నద్ధుఁడై రథియై నిషంగి
యై కపాలివ్రజము ముంచె నంపవల్లి. 191.

క. ఆరీతి నృపతి కుమతుల
మాఱుకొనం గ్రికచునాజ్ఞ మఱియొక కలనన్
క్రూరకపాలు లుదాయుధు
లై రవరవ నఱుకఁ గవిసి రవనీసురులన్. 192.

చ యమభటులట్లు పైఁబడెదుసట్టికపాలిసహస్రముల్ సమీ
పమునన కాంచి గొల్లుమని పాఱులు శంకరుఁ జేరి దేవ! కా
వు మనుచుఁ గూయిడన్ యతియు బూదిగఁజేసెను హుంకృతియోత్థని
స్వనమదహానార్చులన్ నిశితశస్త్రసహాయుల నాతతాయులన్. 193.

క. భూనేత కనకపుంఖశి
రాసీకనికృత్తశాత్రవాస్యకమలసం
తానపరిష్కృతరణమహి
మై నిరుపమభక్తి మెఱయ యతిపతి కొఱఁగెన్. 194.

మ. క్రకచుం డంత స్వకీయు లంత మగుటన్, బ్రాహ్మణ్య మక్లేశ ము
త్సుక మాటం గని దూయమానచలచిత్తుండై యతీశానునం
తికమున్ జేరి 'దురాత్మ! నామహిమమున్ వీక్షింపుమా యింత కిం
త కనంజాలెదవంచుఁ గేలఁ బుఱియన్ గైకొంచుఁ గన్మోడ్చిలోన్.

గీ. భైరవాగమమార్గమ్ముఁ బట్టి ధ్యాన
మాచరింపఁ గరోటి మద్యంబు పొడమె
నందు సగ మాని, పుఱియఁ దక్కర్ధ మూని
భైరవు స్మరించు నంత నబ్రమ్ము దోఁప. 196.

క. మౌళిను మహాకపాలి తి
శూలి నరకపాలమాలి శోచిష్కేశ
జ్వాలాజాలనిభజటా
పాళి పొడమె నట్టహాసభాశ్యాలియునై. 197.

చ. అటు పొడనూపు భైరవుని యంఘ్రుల వ్రాలి 'భవన్మతాశ్రిత
చ్యుటఁ బొరిగొన్న యీఖలు వెసన్ గనుమంట దహింపు' మన్న, ను
త్కట రుష 'మత్స్వరూపు యతివల్లభుఁ జంపు మటండె' యంచున
క్కటు మతిమాళి శూలమునఁగ్రక్కువఁ ద్రుంచినటులెవె నెంతయున్.

గీ. అంతఁ గోత్రిభయంకరుండై నటించు
నట్టి సంహారభైరవు నంఘ్రియుగళి
వ్రాలి శంకరదేశికేశ్వరుఁడు సన్ను
తించి యిట్లను భయము భక్తియును మెఱయ. 199.

సీ. స్వామి! వేదపురాణశాస్త్రసంప్రతిపాది
తమగుకర్మమ్ము కర్తవ్య మనుచుఁ
దత్కర్మమున నబ్బు ధర్మమ్ము దానమ
హాఘకోటులు నాశ మందు ననుచు
నాశుచివర్తమున నంతరంగము పాప
దూరమై శుద్ధమై తోఁచు ననుచుఁ
జిత్తవైమల్యమ్ము చేకుఱ నాత్మసా
క్షాత్కార మప్పుడ గలుగు ననుచు
గీ. నపునరావృత్తిమోక్ష మయ్యాదియె యనుచు
నఖిలభూసురపరిషదభ్యంతరాళ
మందు నద్వైతమతసార మర్థి నుడువు
చుంటి జగతికి భవపీడ యోసరిలఁగ. 200.

ఉ. ఆయెడ నీదు భక్తుఁడు రయంబున వీఁ డరుదెంచి రూక్ష మా
చాయ 'నిదెల్లఁ ద' ప్పనుచు నసంగతనూమణయుక్తికోటులన్
గూయ, మదీయశిష్యతతి గొట్టి మొదల్ జెయివెట్టి నెట్ట, వై
ధేయత మంత్రిశక్తి నిను దెచ్చెను, జచ్చెను శూలకృత్తుఁడై. 201

క. దేవా! సత్యాసత్యము
లీవ యిఁకన్ దెలిపి ప్రోవుమీ మ మ్మన నా
దేవుఁ డనియె ద్విజశిక్షణ
కై పిలసిన శంకరుండ చూ దీవాళ్యా! 202.

ఉ. వేదపదార్థగమ్యుఁడవు విశ్వసమర్చ్యుఁడ వీ వొనర్చు నే
దేదియు నే నొనర్చినటులే యగు-బ్రాహ్మణధర్మ మూఁది యీ
యీదురితాత్ము లెల్లఁ దరియింప నొనర్పు, కలిప్రభావ మి
ట్లాదుకొనంగ నిష్ట మగునట్లు చరింతురు వీరు క్రూరులై. 303.

ఆ. మంత్రబద్ధుఁడ నాట దుర్మతికి వీని
కకట! ప్రత్యర్థుమైనాఁడ నంతెకాని
ధర్మమునఁ గా దటంచు నందఱును గాంచు
చుండ భైరవుఁ డంత ర్హితుం డగుటయు. 204.

క. ఆపట్టున వటుకాదులు
కాపాలికదుర్మతానుగతులు తదీయా
లాపముల కలికి శంకరు
శ్రీపదముల కాచరించిరి నతుల్ పదిరెండ్రున్. 205.

ఉ. వా రరు దొంది 'మే మకట! స్వామి! విమూఢుల మేలుమాకృపా
సారముఁ జిక్కె మ' మ్మనుచుఁ జల్లని మాటల నాదరించు చ
క్కారుణికాగ్రగామి కడగంటన శిష్యులఁ గాంచి పూతుఁగా
వారి నొనర్ప నాజ్ఞయిడ వైళమ పద్మపదాదు లొక్కరై. 206.

గీ. వారలను బ్రాత రవగాహ పరులు గాఁగ
సతతసంధ్యావిధా ద్యనుష్ఠాన పూర్వ
పంచయజ్ఞ పంచాయత నార్చన నియ
తులుగ బ్రాహ్మణాధ్వగులుగ సలిపి రెలమి. 207.

వ. సమాహితచిత్తులై వటుకాదు లగునాకాపాలికు లద్వైతమతనివి
ష్టులై శంకరచరణంబులు శరణంబుగ నమ్మి శిష్యులై సేవించు
నెడ నొక్క కాపాలికధూర్తుం డరుదెంచి యిట్లను. 208.

ఉన్మత్తభైరవునితో వాదము.

సీ. కాపాలికమతానఁ గలుగుచో న్యానత
పరమతంబుల నింత ఫలము గలదె?
బ్రహ్మజాతియు గొప్ప దనుదురూహా ని
వ్వటుకాదులు స్వమతభ్రష్టులైరి
జాతిచే నేప్రయోజనమును గనఁబోము
సకలదేహములు భౌతికము లగుట
'నిద్ది యీజాతి 'యం చెవఁడు సెప్పఁగలాఁడు
కాన నేతజ్జాతి కల్పితంబ
గీ. యిందుఁ బ్రమాణ మగపడ దింక నద్ది
వినుము ద్వివిధంబు, స్త్రీజాతి యనఁగఁ బురుష
జాతి యన- నందు నాద్య శ్రేష్ఠము తదీయ
సంగమ మ్మతియానందజనక మగుట. 209.

ఆ. గమ్య యీమె, యిది యగమ్య- యీఁ డిచ్చెడి
వాఁడు పరునియాలిఁ గూడ రా ద
టన్నునుడిని నమ్మ మఖిలకాంతలు స్వీయ
లగుట; 'దోస మంటు' ననుట తగదు. 2010.

క. ఆనందార్థము చర్మము
చే నొకచర్మమ్ము నొరయ జీవున కఘు ము
క్తా 'నానందజతృప్తియె
యా నలజీవునకు మోక్ష' మనరే పెద్దల్. 211.

క. కానఁ దత్సంగ స్ఫుట
మానందమె భైరవుఁడు; నిజాంగలయమునన్
దా నాదేవుని గలియుటె
యా నిక్కపుముక్తి తెలియుమా మన్మతమున్. 212.

సీ. అనుచుఁ దెల్పఁగ శంకరాచార్యుఁ డనియెఁ గా
 పాలిక!సత్యంబు పలికి తీవు
నీతల్లి యెవ్వానికూఁతు రం చన వాఁడు
 దీక్షితసుత యంచుఁ దెల్ప యతియు
దీక్షితత్వమ్ము సిద్ధించె నాతని కట్టు
 లనుడుఁ గాపాలికుం డనియె నిట్లు
శాల హింతా లాదితరువుల కలు గీయుఁ
 దదు్రచి యెత్తిఁగియుఁ దా్రవఁ డొకవు
గీ. డమ్ము నితరుల కింత న్యాయమ్ముఁ దప్ప
దది గని జనంబు దీక్షితుం డనుచుఁ బిలుచు
నట్టిదీక్షితుపట్టి మాయమ్మ, యింక
నాయమచరిత్రము వచింతు నాలకింపు. 213.

క. నిచ్చలు తనుఁ జేరినవరు
లచ్చపుసుఖవార్ధి నోలలాడఁగ దేహం
బిచ్చి వ్రతము నెఱపుకొనిన
నచ్చరిత మదంబ; జనకచరితము వినుతఁ. 214.

ఆ. ఎవనిమద్యగంధ మిసుమంత సోఁక స
న్నిధిని నిలువలేక నిర్జరులును
బఱవఁ జొత్తు రట్టిప్రఖ్యాతి గన్నసు
రాకరాహ్వయుండు నాకుఁ దండ్రి. 215.

క. ఉన్మత్తభైర వాఖ్యుఁడ
నన్మాన్యుఁడ నిట్టియాభిజాత్యము గలన
న్మున్నీ రర్చించిన జీ
వన్ముక్తుల రగుడు రనిన వారనికనుకఁ. 216.

ఉ. పేరిలక యూలకేఁగి పృథివిన్ విహరింపు యథేష్టరీతిఁ గా
పాలిక! దుర్మతస్థితుల బ్రాహ్మణజాతుల శిక్ష సేసి స
చ్ఛీలురఁ జేయువ్రాన్కి నరుదెంతును గా, కొరులన్ స్మరింప నా
కేల? యటం 'చవాచ్యుఁ డగునీఖలుఁ దప్పఁగ రువ్వఁడా యనన్.

ఉ. మూకలు గట్టి శిష్యులధముం డగుభైరవుఁ డూరిఁ బట్టి వి
ద్యేకులఁ బెట్టి యొజ్జనుడి వెంటన దప్పుల నెట్టి రంతఁ జా
ర్వాకుఁ డొకండు వచ్చి యతిరాజుఁ గనుంగొని నైజ నోవ క
ట్టాకలఁ బెట్టుచిత్తమున యందు విచార మొనర్చె నీక్రియన్.

చార్వాకమతనిరాకరణము.

సీ. తనరు దేహాద్యతీతముగ నాత్మ మ టంచు
వదరుమూర్ఖులతోడ వసుధ నిండె
మాకు నైతము నట్టిమతి గల్గు నేమొ త
త్సాంగత్యమున నను త్రోప మొదవె
వారి కందఱ కగ్రచారి యీసన్న్యాసి
యటఁ యెంచుకంత మాటాడవలయు
నిలుతు నింత వివేకకలితుఁ డంచును దోఁచె
నేని, గాకున్నఁ దోడ్తోన చన్న
గీ. నని విచారించి సభసొచ్చి యతిని జేరి
తత్త్వ మెఱుఁగుదువే ననంతరము మోక్ష
లక్షణము తెల్పుదువు గాని లలితఫణితి
వినుచు నన్మద్వివేకమ్ము వినుము తొలుత. 219.

క. జలనిధిజలముల విలయ
మ్మొలయునదుల కాగమనమె యున్నెడ మృతుఁ డీ
యిల మరలఁ బొడముఁ, గావున
విలయమె జీవునకు ముక్తి వివరింపంగన్. 220.

ఆ. తృప్తిఁ డగు మృతుండు దీనిచే నంచు శ్రా
ద్ధాదికాండ మాచరించునట్టి
మోహితుల వివేకమునకు న వ్వొదవును
వారిచిత్రమతము గోరు నెవఁడు? 221.

గీ. కాయమే యాదిరూపమ్ముగా జనించి
యట్టికాయమ్మె తా నయి యలరుజీవు
నకు లయమె ముక్తి, కా దిఁ కన్యంబు— మూఢు
లట్టి జీవుండు మఱిమఱిఁ బుట్టు నండ్రు. 222.

సీ. 'పరలోకములు స్వర్గనరకముల్ గల వవి
పుణ్యపాపప్రాప్యములు క్రమముగ
నాపుణ్యపాపమ్ము లయి పోవ జీవుండు
మరల మర్త్యమున జన్మంబు నెత్తు'
ననువారి మత మెంతయును నప్రమాణ మ
య్యుభయానుభవ మిట నొదవదొక్క—
యెవ్వాఁడు సుఖభోక్త యవ్వాఁడె స్వర్గి, యె
వ్వాఁడు దుఃఖభోక్త యవ్వాఁడె నిరయి
గీ. యిటుల ప్రత్యక్ష మనుభవం బేర్పడంగ
నెటొ పరోక్షమ్ము కల్పింప నేటిపాడి?
యింద్రియములు దేహము నశియింప నింక
నెవఁడు పరలోకమున కేఁగు? నెట్టు లేఁగు? 223.

గీ. అరయ జీవుండు దేహేంద్రియాదు లగుట
దేహము నశింప జీవుండు దీఱిపోవుఁ
'గన నగును ఛేద' మన మహాకాశమందు
నంతరించుఘటాకాశ మట్ల డిందు. 224.

ఆ. శాన మాటమతము జగన్మిథ్య యంచుఁ జా
ర్వాకుఁ డనఁగ నిట్లు పలికె యతియు
వేదబాహ్యమతము నీది నుత్యం బెట్టు
లస్మదీయమతము నాలకింపు. 225.

సీ. ఆయాత్మ దేహేంద్రియాదులకు విభిన్న
మదె ముక్తమై పరమాత్మ మగును
అజ్ఞానమునఁ బరమాత్ముఁడే బద్ధుఁ డౌ
జ్ఞానమ్మున విముక్తుఁ డౌనఁ జుమ్మో
'దేహపాతమున ముక్తి లభించు' ననుత్వదా
లాపమ్ము భ్రాంతిమూలము నిజముగ
జ్ఞానాగ్ని నిర్దగ్ధ కర్ముఁలై కందురి బ్ర
హ్మము నంచు జ్ఞానమాత్రమ విముక్తి
గీ. హేతువుగఁ జెల్పు శ్రుతియు; య దెటు ప్రమాణ?
మనిన నీకుత్పత్తోక్తి యైనా ప్రమాణ?
మగ్ని దహియింప స్థూలదేహంబు, లింగ
దేహ మూఁది జీవాత్మ యెందేని యేఁగు. 226.

వ ఇందులకు 'స్వర్గకాముండు జ్యోతిష్టోమము చేయఁ దగు, నిత్యా
ది వేదవాక్యములె ప్రమాణము. 227.

క. శ్రుతిజీవుఁ దృణజలూకా
ప్రతిమునిగ వచించెఁ దనువు పడ; నన్యతనూ
గతుఁడై పరలోక మొనయు
నతనికిఁ దత్సుతులు చేయుదగు శ్రాద్ధాదుల్. 228.

చ. అనియును జ్యోతిరాకహితుఁడై యతఁ డుత్తమలోక మొందఁ జే
యున తగుఁ బిండదానము గయాదుల నంచుఁ బురాణ ధర్మశా

త్రనివహ ముగ్గడించుటను సప్తదశాంగము లింగదేహముం
'దన' దని పొంది జీవుఁడు పతంగమురీతిఁ బరత్రి దాఁ జనున్. 229.

క. కావున మాటాడక చను
మీ వాచార్యాక! జడమతీ! యని పలుకం
గా వాఁడు వేషభావలఁ
బో విడచి యతీంద్రపాదములకున్ మ్రొక్కెన్. 230.

వ. అట్లు మ్రొక్కి యథావిధి నాజగద్గురులకు శిష్యుండై నాఁటం గో
లెఁ దత్పుస్తకభార భరణరూప శుశ్రూషాపరుం డయ్యె నట్టి యె
డఁ బీనకాయుం డగుసౌగతుం డొక్కఁడే తెంచి శంకరునకు మ్రొ
క్కి యి ట్లను. 231.

సౌగతునితోడి వాదము.

ఉ. ఆదృతకర్మమార్గు లయి రజ్ఞత నీజను లిట్లు; స్నానదా
నాదుల భౌతికంబునకు నబ్బును శుద్ధి? సదా విశుద్ధి పెం
పూఁదెడుజీవుఁ డంగ మటు లూడ్చి విముక్తిని బొందుచుండఁగాఁ
'నేదొ ఋణానఁ జిక్కి జనియించు మతిన్ భువి'నండ్రు దుర్మతుల్.

గీ. ఋణము మే నెత్తునప్పు డదృష్ట, మటులె
యంతమున లేదు, కాన ద్రవ్యము గడింప
ఋణభయము వాయువలె వినవే 'ఋణం బొ
నర్చి నెయి త్రావవలయు' న న్వాక్యరీతి. 233.

చ. అది పరమప్రమాణము, నిరంతర మెల్లెడ నప్పనేసి పెం
చఁదగుఁ గళేబరంబు మతిశాలి; సుఖం బఖిలాన్నభోక్తకే
యొదవును, ముక్తి నాఁగ నటు లొందుసుఖంబె సుమా! విముక్తికే
కొదవ మతి నొప్పియత్న-మనఁగా విని యయ్యతి పల్కె సౌగతున్.

ఉ. నీదు వృథాప్రలాప మిఁకనేనియు మాను శ్రుతిస్మృతీతిహా
సాదులు కర్మభోగమునకై పరలోకగతిన్ వచించుటన్
బోదు ఋణాదికర్త కిఁ బుట్టుట చచ్చుట; కానఁ బాపసం
పాదక మాకుబుద్ధి నెడఁబాసి చరింపుము సత్పథంబునన్. 234.

గీ. అనుడు సౌగతుఁ డిటు లను వినుము సుగతుఁ
డనుముని సమస్తభువిఁ గాంచి, కని జగన్ని
సర్గసత్యమ్ముఁ, బ్రాణ్యుపాసనరతుఁ డయి
కరుణ నుపదేశమిచ్చె నిక్కరణి నాకు. 235.

ఉ. గణ్యము ప్రాణ్యహింస యనఁగా దగు ధర్మ మొకండె, నీవు త
త్ప్రాణ్యవిహింసనంబునఁ గపాలనివర్తన మూని మోక్షసా
ద్గుణ్యము గాంచు మంచు దయతో ననుతద్గురువాక్కులెంచియా
నృణ్యము గల్గఁ దద్వచనమే కొని ప్రాణ్యవిహింసఁ బూనితిన్. 236.

ఆ. ఆత్మ గురునిపదము లాదల్చఁ దద్వాక్కు
లూని సకలచేతనానుకంప
వ్రతముగాఁ జరింతు క్షితి నున్న యిట్టిధ
ర్మమ్ము సర్వసమ్మతమ్ము నమ్ము. 237

వ. మామతము ధర్మస్థానము కావుటం జేసి యెల్లరు మేకొనఁ దగిన
దనుటయు నాచార్యుం డి ట్లను. 238.

సీ. ఏమంటి వోరి నిహీన! సౌగత! యహిం
సాన్యధర్మంబె లే దనఁ దెగింతు
యాగీయహింసన మది ధర్మ మనుచు వే
దములు పేర్కొనవె వ్యక్తమ్ము గాఁగ
నాకి స్వర్గ మిచ్చు నగ్నిష్టోమ ముఖ్యమ
ఖమ్ములు పశుహింస కారణముగఁ

బ్రాహ్మ్య మాహింస శ్రుత్యాచారరతులకుఁ
బాపంపు లగుదు రప్పథము దొలఁగ
గీ. బ్రహ్మవీర్యజులేని నారకమునందుఁ
బడెదువారగ సదాచారవర్జనమున
వేదనింద నటంచు మన్వాదు లనుట
నట్టి రాకల్పనిరయులై యార్తి గందు్రి. 239.

వ. కావున బ్రాహ్మణాదివర్ణజులకు వేద నిరూపితాచారంబు పరమప్రమాణంబు, దాని నంగీకరింపనివాఁ డధముఁ డనుటయు నాసౌగతుండు ప్రమాణశూన్యం డగుటఁ బ్రతి వచింప నేరక శంకరునకు మ్రొక్కి, తదుచ్ఛిష్టాదనపుష్టిమై, పద్మపాదాదులకుఁ బాదుకావాహకుండై సేవించుచుండ నొక్కనాడు. 240.

క్షపణకమతనిరాకరణము.

క. ఒకకేలఁ దురీయంత్రము
నొకకేలం గోశయంత్రమూని కటిని గౌం
డొకకౌపీనము దాలిచి
యొకక్షపణకుఁ డేఁగు దెంచి యొజ్జకు ననియెన్. 241.

క. స్వామీ వినుమీ యరుదగు
నామత మత్యంతశోభనము 'సమయం' బ
న్నామమ్ము వాఁడఁ బూర్ణుఁడ
నేమతమును మామకైంద్రియికమత సమమే. 242.

శా. హేళిన్ గాలనియంత యంత్రయుగళిన్ హేలాగతిన్ గట్టి త
త్కాలజ్ఞానముచే వచింతుఁ ద్రిలోకంబందు రానుండుని
ర్త్యాలం బైనశుభాశుభార్థముల భావింతున్ సదా వేల్పుగాఁ
గాలంబున్; బరమేశుఁడున్ గదలుపంగా లేఁడు నావశమున్ 243.

చ. అన విని శంకరార్యుఁడు సమంచితరీతి వచించి, తెంచితిన్
'నిను సమయజ్ఞుఁ' డం చెపుడు నేనిఁ బరీక్ష ఘటిల్లకుండ, దం
డనుక మదాశ్రయంబున మనం గదె, పరీక్ష మొనర్తు నాఁడె యం
చనవుడు వాఁడు నియ్యకొని సమ్మఱునా డతిభీకరాకృతిన్. 244

జైనమతనిరాసము.

శా. కౌపీనంబును మాత్రఁ దాల్చి మలదిగ్ధం బైన మేనొప్ప, నం
కాపేతుండు నపుండ్రుఁ డయ్యు ధృతదీవ్యద్బిందుపుండ్రుండునై
యాపట్లన్ జనుదెంచె జైనుఁ డొకరుం "డర్హన్నమో" యంచు దీ
క్ష్యోపేతంబుగ రేఁగి బొబ్బ లిడుకొం చొయ్యన్ బిశాచం బనన్.

క. చనుదెంచి శంకరుం గని
యనెః- జినుఁ డను దేవుఁ డెల్ల ప్రాణుల హృదులం
దున జీవుఁ డన వెలుఁగు, ము
క్తి నొసంగును ముక్తుఁ డగు నతిజ్ఞానమునన్. 246.

ఉ. ఆతఁడు శుద్ధుఁ డౌఁ దనులయం బొదవన్, మలపిండరూపమౌ
నీతను వెట్లు శుద్ధమగు నెందు మునింగిన నెట్టిగందపుం
బూఁతలఁ బెట్టినన్ వలిపముల్ పయిఁ జుట్టిన? గాన స్నానముల్
పూఁతలు రోఁతలంచును బ్రబోధ మొనర్పఁగ శంకరుం డనున్. 247

సీ. దేహ మొక్కటి యెట్లు త్రితయ ముండఁగ స్థూల
సూక్ష్మకారణము లంచును బ్రసిద్ధిఁ
గ్రమముగా నవి నాశనము నొంద సచ్చిదా
నందరూపము జీవుఁ డొంది వెలుఁగు
నీశభిన్నుఁడ నను నెఱుక యవిద్యఁ జీ
వుఁడు తదవిద్య బద్ధుఁ డగుఁ బోవు

నే నభిన్నుఁడ నీశునికి ననుమతి విద్య,
యద్దాన భవముక్తుఁ డగును దేహి.

గీ. యిటు సుదుర్లభ మగు మోక్ష మెటుల దేహ
పాతమాత్రమునన యుట్టిపడు ననియెడు
శంకరుపదంబులకు మ్రొక్కి ఛాత్రుఁ డయ్యె
వాఁడు సహశిష్యుఁడై వేషభాష లుడిగి. 248.

బౌద్ధునితోడి వాదము.

ఆ. అంత శబలనాముఁ డగు బౌద్ధుఁ డేఁతెంచి
యతివరేణ్యుఁ గాంచి యనియె నిటుల
త్వత్ప్రబోధ మెల్ల వ్యర్థంబు నరశృంగ
మునకు సమ మభేదమును దలంప. 249.

గీ. ఈవు సర్వోత్తముఁడ విట్టు లేల యయిత
దృష్టఫల ముజ్జగించి యదృష్టఫలము
కోరె దది దూర, మేమి చేకూర్చు నీకు
శూన్యముగదా పరోక్ష మిచ్చున ఫలంబు. 250.

శా. నిర్జీవం బగుటన్ భవన్మతము కంటే వ్యర్థ, మస్మన్మతం
బూర్జస్వంతము, దాన నాత్మ మొకఁడయ్యున్ బెక్కులై చేతనా
త్యార్జంబై హృదయాదిఁ బ్రేరణము సేయున్ నిత్యముక్తంబునై
యార్జించున్ సుఖ మక్షయంబుగ సతం బద్వైతశూన్యం బగున్.

క. నేనే కర్తను భోక్తఁ బ
రానందాకృతి నటంచు స్వాభీష్టములన్
ధ్యానము గల యన్నాళ్ళై
మేనులఁ గ్రీడించి, కాంచు మే నటు ముక్తిన్. 252.

వ. అనుటయు శంకరుం డి ట్లను. 253.

క. విను మిందు్రిలు పదునలువురు
చనుదాఁక వసించు బ్రహ్మజగమున సత్యం
బును శౌచము గలిగి సురా
ర్చన యతిథిసపర్య సలుపుసజ్జనుఁ డర్థిన్. 254.

క. అమరు లలర నగ్నిష్టో
మము సేయఁగ నింద్రలోకమందిరుఁ డగు, యా
గము పౌండరీక మొనరుప
నమరుం దత్సత్యలోకమందుం గాఁపై. 255.

వ. కాన నాయా దేవతల నుపాసించువా రాయా దేవతలఁ జేర నరుగు
దురు. మఱియు భగవద్గీతయందు "యోయో యాంయాం తనుం
భక్త్యా శ్రద్ధయార్చితు మిచ్ఛతి । తస్య తస్యాచలాం శ్రద్ధాం తా
మేవ విదధామ్యహా" మ్మనుభగవంతుని వాక్యమువలనఁ బరలోక
గమనాదికము సిద్ధ మగుచుండెఁ గాన దేహపాతమాత్రంబున ము
క్తి లభింప దని యెఱుంగుము మఱియు. 256.

శా. 'యావద్భూతములందుఁ దన్నుఁ దనయం దాభూతకోట్లం గనం
గా విన్నాణి యెవండో వాఁ డొకఁడె తాఁ గాంచున్ బరబ్రహ్మమిం
కేవాఁడున్ గనఁజాలఁ' డంచు శ్రుతియుం దేర్పాటుగా నుండె 'జ్ఞా
నావిర్భూతినిదక్క ముక్తి గనరా' దం చాపథ మ్మ్మాన నో, 257

ఉ. కాన ననర్థదాయి మతికల్పిత మాటను జీవభావమున్
లేనటు పుచ్చి, శాశ్వతికనిర్వృతి గాంచుటె ముక్తి సుమ్ము యిం
కేని త్యజించి మాధ్యము సుఖంపు మనన్ విని వాఁడు శంకరాం
ఘ్రినతుఁడై తదద్భుతయశోఽభినుతివ్రత మూని వందియై. 258.

మల్లపురమున మల్లారిభక్తుల నద్వైతులఁ జేయుట.

క. తదనంతర మాదేశము
వదలి జగద్గురుఁడు శిష్యపరివృతుఁడై న
మ్మదిఁ మల్లపురికిఁ జని యి
ర్వదియొకదినములు వసించె స్వాస్థ్యము మెఱయన్. 259.

చ. మఱి యచటన్ వసించుద్విజమండలిఁ గన్గొని 'ప్రాతరాదిగా
నిరతము నెల్లవేళఁ గరణీయము మీ, కెది సెప్పుఁ డన్నఁ జె
ప్పి రిటుల వారు 'మల్లుఁ డనుపేరి సురారి హరించి దేవుఁ డీ
పురి నెలకొన్నవాఁ డతనిమూర్తి భజించుటె కృత్య మెప్పుడున్.

క. మల్లారి యనెడు నవ్వే
ల్పెల్లరకు నుపాస్యుఁ డతని యెకిరింతమునీ
వల్లభుఁని, వేషభాషా
దు ల్లీల ధరింతు మానుదుము మెడ గవ్వల్. 261.

శా. మల్లారిన్ బ్రభు సుప్రసన్ను నొనరింపంగంటి మోస్వామి! యు
ద్యల్లీలార్పితనాట్యవాద్యములచేతన్ దత్కటాక్షాప్తసం
వల్లాభమ్మున వర్ధమానసుఖసంపన్మగ్నులై మేము యా
వల్లోకంబుఁ దలంతు మేతదుదరాభ్యంతస్స్థితం బం చెదన్. 262.

సీ. మాకు సుఖేచ్ఛ యేమాత్రమ్ము లేదు వ
ర్తింతు మామ్నాయవిధిప్రకార
మరయ "నమః శ్వభ్య" యని "శ్వపతిభ్యశ్చ
వో నమ" యనియు వేదానువాక
మాయీశ్వరునకు వాహన మగు శ్వానమ్ము
నకును సార్వాత్మ్య మున్నతి వచించెఁ
దద్వేషభాషాదిధారణంబున నస్య
ములయెడఁ గోర్కె యేఁ బొడమకుండు

